# జమీన్ రైతు

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి




*తన స్టూడియో వ్యాపారం కోసం ఈనాడు రామోజీరావు తాపత్రయం*

# మద్యనిషేధం రద్దుకు వత్తిడి?

కంచే చేను మేసిందని చెప్తే నమ్మడమెంత కష్టమో, ఈనాడు రామోజీ రావు గారు మద్య నిషేధం సడలింపు కోరుతున్నారని చెప్పితే నమ్మడం అంతే కష్టం. ఆయన అంతటి పాపు కార్యానికి పాల్పడ తాడని పసిపిల్లలూ విశ్వసించరు; కానీ అది నిజం; నూటికి నూరుపాళ్ల నిజం.

మద్య నిషేధం రామోజీ రావు గారి కలల పంట; కష్ట ఫలం. నెల్లూరు జిల్లాలోని ఒక చిన్న పల్లెటూరులో ఒకరిద్దరు పేద ఆడపడుచుల క్రతువు మంటగా మొదలైన సారా ఉద్యమం రాష్ట్ర వ్యాప్తంగా, కార్చిచ్చు వలె వ్యాపించ డానికి కారకులు, ప్రేరకులు రామోజీ రావు గారే! ఉద్యమానికి నాంది పల్కిన వాడు ఆనాటి నెల్లూరు కలెక్టర్ శ్రీ కె. రాజా అయితే, నడిపించిన వారు రామోజీ రావు. ఆయన పాంచజన్యం పూరిన అర్జునుడైతే, ఈయన పంచ అశ్వాల రథానికి పగ్గాలు పట్టిన కృష్ణుడు. రామోజీ రావు పూనుకొని వుండకపోతే, అది అటాకుల మంటవలె చల్లారి పోయి వుండేది; నెల్లూరు ఎల్లల లోపలే నిల్చిపోయేది. అందుకోసం ఆయన తన పత్రికను, తన ప్రతిష్ఠను పణంగా పెట్టారు. వార్తల కాగడాలు వెలిగించి, ఉద్యమానికి వెలుగు రేఖలు ఇచ్చారు. పేపరు తెరిస్తే సారాయి గొడవేనా అని పాఠకులు విసుక్కున్నా; అది శృతి మించితే తన పత్రిక సర్క్యులేషన్ పడిపోతుందని ఎందరో భయపెట్టినా లెక్క చేయకుండా, ఉద్యమానికి విస్తృత ప్రచారం కల్పించాడు. ఆయన పట్టుదలే రాష్ట్ర వ్యాప్త మద్య నిషేధానికి కీలక కారణం.

అప్పుడే కాదు – ఆరు నెలల క్రితం చంద్ర బాబు తన దివాలా ప్రభుత్వాన్ని నిలబెట్టు కోవడానికి మద్య నిషేధం సడలింపుకు నిర్ణయం చేసినప్పుడూ – రామోజీ రావు దాన్ని ప్రతిఘటించారు. చంద్ర బాబు మేలుకోరే వాడైనప్పటికీ, ఈ విషయంలో రాజీ పడలేదు. ఆయన బెదరింపుకు భయపడే చంద్ర బాబు ఆ ఆలోచన మాని, రైతులపై పన్నుల భారం మోపే దివాలా కోరు నిర్ణయం తీసుకున్నా రన్నది నిజం. అటువంటి రామోజీ రావు ఇప్పుడు మద్య నిషేధం రద్దు కోరుతున్నారని చెప్తె నమ్మడం కష్టమే కదా? కాని అది నిజం.

హైదరాబాదు శివార్లలో తాను నిర్మించిన ఫిలిం స్టూడియోను బ్రతికించు కోవడానికి రామోజీ రావు గారు తన ఆశయంతో రాజీపడక తప్పడం లేదు. ఆశయం కంటె ఆశ గొప్పది; చెడ్డది కూడా!

దాదాపు 150 కోట్ల పెట్టుబడితో నిర్మించిన స్టూడియో ఇది. దీనిపై మరొక 300 కోట్ల వరకు దశల వారీగా పెట్టుబడి పెట్టి, హాలీవుడ్‌కు దీటుగా తయారు చేయాలన్నది ఆయన స్వప్నం. సినిమా తీయడానికి కావలసిన సర్వహంగులూ ఇందులో వుంటాయి. నదులు, చెరువులు, నగరాలు, పల్లెటూళ్లు, కొండలు, అడవులు... చివరకు సముద్రం కూడా కృత్రిమంగా సృష్టించే యత్నం చేస్తున్నారు. రికార్డింగ్, డబ్బింగ్, ప్రివ్యూ, కంప్యూటర్ గ్రాఫిక్స్ వంటి సాంకేతిక సౌకర్యాలన్నీ వుంటాయి. లోపలే ఒక ఫైవ్ స్టార్ హోటల్, రెస్టారెంట్లు కడుతున్నారు.

కేవలం తెలుగు సినిమాల కోసమైతే ఇన్ని హంగులు అవసరం లేదు. కాని బొంబాయి నుంచే గాక, హాంకాంగ్ వంటి దేశాల నుంచీ నిర్మాతలను ఆకర్షించా లన్నది రామోజీ రావు బృహత్ పథకం. నిర్మాతలు డబ్బుతో లోపలకు వస్తే, రీళ్ల డబ్బాలతో వెనక్కి తిరిగి వెళ్లగలిగేలా తన స్టూడియోను తీర్చి దిద్ద బోతున్నా రాయన.

అయితే, ఇటువంటి స్టూడియో ఆసియాలోని ఏ దేశంలోనూ లేదని మెచ్చుకుంటూనే – వచ్చిన నిర్మాతలు వచ్చినట్లే వెనక్కి వెళ్లిపోతున్నారు, పాపం! ప్రారంభోత్సవానికి ముందే డేట్లు బుక్ అయిపో వలసింది కాస్త, అసలు నడుస్తుందా అనే సందేహం కలుగుతుంది. ఇందుకు కారణం – మద్య నిషేధం. విస్కీ లేనిదే పూటైన పిల్చలేని సినీ జీవులు హైదరాబాదుకు రావడానికి ఇష్టపడటం లేదు. నటీనటులు, సాంకేతిక నిపుణులను ఇక్కడకు రప్పించడం కష్టమని నిర్మాతలు అశక్తత వ్యక్తం చేస్తున్నారట.

అందువల్లే ఆయనలో మద్య నిషేధం సడలింపు కోరిక కలుగుతోంది. ఐఎంఎఫ్ఎల్ వరకు అనుమతించి, సారా నిషేధం కొనసాగించమని ఆయన చంద్ర బాబుకు సూచించారు. ఉప ఎన్నికలు ముగిసిన తర్వాత ఒక పథకం ప్రకారం ఈ సడలింపుకు రంగం సిద్ధమౌ తున్నది. సామాజిక విప్లవం నినాదంతో, ప్రభుత్వ

కొరవ 8 పేజీలో

జయప్రకాష్ నారాయణను బలిపశువును చేస్తారా?

## వెయ్యికోట్ల సింగరేణి దుబారాపై ప్రజా ప్రయోజన కేసు దాఖలు?

దేశాన్ని ఒక్క కుదుపు కుదుపుతున్న యూరియా, టెలిఫోన్లు, లఖూభాయ్ పాఠక్ వంటి కేసుల తరహాలో, ఆంధ్ర ప్రదేశ్ రాజకీయ వాదులు, అధికారులపై కూడా ఒక ప్రజా ప్రయోజన వ్యాజ్యం నడిపించ డానికి ప్రయత్నాలు జరుగు తున్నాయి. విశేషమేమి టంటే – ఆ కేసులన్నింటి వల్లా దేశానికి జరిగిన ఆర్థిక నష్టం కంటే ఈ సంఘటనలో ప్రజల సొమ్ము అధికంగా దుబారా కావడం!

సింగరేణి కాలరీస్‌లో, రెండవ ఓపన్ క్యాస్ట్ మైనింగ్‌కు సంబంధించి బొగ్గును చిన్న చిన్న ముక్కలుగా నలిపి, గని నుంచి బయటకు రవాణా చేసే కాంట్రాక్టును ఒక జర్మనీ కంపెనీకి ఇవ్వడంలో అప్పటి మేనేజింగ్ డైరక్టర్ వళ్లియప్పన్; ఇప్పుడు మేనేజింగ్ డైరెక్టర్ కాబోతున్న వ్యాస్ అనే అధికారులు పెద్ద ఎత్తున అవినీతికి పాల్పడ్డారు. 250 కోట్ల లోపు అంచనా వేసిన పనిని 500 కోట్లకు పెంచిన కంపెనీకి కాంట్రాక్టు ఇచ్చారు వీరు. పైపెచ్చు వారా పని సక్రమంగా చేయకుండా, చెత్తతో సమానమైన సాంకేతిక పరిజ్ఞానం వాడడం వల్ల ఒక్కొక్క టన్ను బొగ్గు ఉత్పత్తికి 246 రూపాయల అదనపు ఖర్చు పెట్టవలసి వస్తున్నది సింగరేణి కంపెనీ. ఈ అధికారుల అవినీతి వల్ల ఈ గని త్రవ్వకంలో కనీసం వెయ్యి

కొరవ 8 పేజీలో

# అభివృద్ధి అడుగంటి ఆర్థిక మాంద్యం దాపురిస్తూంది!

ఆర్థిక సంస్కరణల ఫలితంగా దేశం అభివృద్ధి పథంలో దూసుకు పోతుందని ఆశిస్తే – వాస్తవంలో ఆర్థిక

> బ్యాంకుల అధికవడ్డీ ఆశ, విదేశీ సంస్థలకు అధిక లాభాల మోజుకు ఆర్థిక వ్యవస్థ అణగారి పోతూంది; ఆర్థిక మంత్రి చేవ చచ్చిపోయింది!

పరిస్థితి కాస్త తిరోగమనంగా పరివర్తన చెందుతూంది. అధిక వడ్డీల కోసం బ్యాంకులు ఒక ప్రక్క; అధిక లాభాల కోసం విదేశీ పెట్టుబడి దారులు ఇంకో ప్రక్క చేరి ఆర్థిక వ్యవస్థను కృంగ దీస్తున్నారు. రాజకీయ అనిశ్చిత స్థితి, అధికారుల అనిర్ణయ వైఖరి ఈ ముంపును మరింత ఎగ్రదోస్తున్నాయి.

దేశంలో పారిశ్రామిక ఉత్పత్తి ముమ్మరంగా జరుగు తూంది. కాని, ఫ్యాక్టరీలలో తయారయ్యే వస్తువులు అమ్మేదు పోవటం లేదు. గోడౌన్లు నిండిపోయి వున్నాయి. డీలర్లు పరిశ్రమలకు డబ్బు చెల్లించడం లేదు. దానితో భవిష్యత్ ఉత్పత్తి ప్రమాదంలో పడిపోతూంది. ఉత్పత్తి తగ్గితే, పరిశ్రమలు మూత పడతాయి; నిరుద్యోగం పెరిగి పోతుంది; పలు సామాజిక సమస్యలు ఉత్పన్నమౌతాయి. ఇది ఆర్థిక మాంద్యానికి సూచన. ఈ పరిస్థితి నుంచి ఆర్థిక వ్యవస్థ బయట పడాలంటే అధిక మొత్తంలో డబ్బు మార్కెట్‌లోకి రావాలి. కాని బ్యాంకులు అందుకు సుముఖంగా లేవు.

బ్యాంకుల వడ్డీ రేట్లు పెరిగి పోతుండడం విచిత్రమైన పరిస్థితి. బ్యాంకులలో ఇప్పుడు డబ్బు పుష్కలంగా వుంది. వడ్డీ రేట్లు తగ్గవలసిన సూచన ఇది. కాని, పెరిగ పోతున్నా యంటే బ్యాంకులన్నీ కలిసి ఒక కూటమిగా ఏర్పడి దోచుకొంటు న్నాయన్న మాట. దేశంలో ద్రవ్యోల్బణం కేవలం 6 శాతం; వడ్డీ రేటు మాత్రం 22 శాతం. ప్రపంచంలో ఇంత అధిక వడ్డీ మరే దేశంలోనూ లేదు.

ఇంకొక ప్రక్క విదేశీ పెట్టుబడి సంస్థలు ఒక కూటమిగా తయారై షేర్ మార్కెట్‌ను కృంగ దీస్తున్నాయి. స్టాక్ ఎక్ఛేంజీలు వారి జూదశాలలుగా మారిపోయాయి. షేర్ల ధరలు పడిపోవడంతో, పరిశ్రమలకు పబ్లిక్ ఇష్యూల ద్వారా నిధుల సేకరణ అసలు కావడం లేదు. దానివల్ల పారిశ్రామిక విస్తరణ ఆగిపోయి వుంది. కొత్త ప్రాజెక్టులు రావడం లేదు.

ఈ దుస్థితి నుంచి ఆర్థిక వ్యవస్థను రక్షించ వలసిన కేంద్ర ప్రభుత్వం రాజకీయ అనిశ్చిత స్థితితో సతమతం కావడం దురదృష్టకర విషయం. మాజీ ప్రధాని పివి నరసింహారావు జైలుకు వెళ్లకుండా ... కృషిలో ప్రధాని దేవెగౌడ; మాజీ ముఖ్యమంత్రి జయలలితను జైలుకు పంపే ప్రయత్నంలో ఆర్థిక మంత్రి చిదంబరం పూర్తిగా మునిగి పోయి వున్నారు. వారికి వేరే ధ్యాసే లేదు.

కనీసం ఎగుమతులు పెరిగినా ఈ సమస్య కొంత వరకు తీరి వుండేది. కాని అవి తగ్గుతున్నాయి. వ్యవసాయ ఉత్పత్తి బాగుపడితే ధన సరఫరా మెరుగు పడుతుందని ఆశించారు కాని, అదీ జరగలేదు. ప్రభుత్వం ఇప్పటికైనా గలదెలుసుకొని, కఠినమైన నిర్ణయాలు తీసుకొంటేనే ఆర్థిక మాంద్యం తప్పదు.

ఆ ఘోర దుస్థితి అనుభవించింది ఇప్పుడు మళ్లీ అటువంటి తీవ్ర ప్రమాదం ఎదురౌ తున్నది.



కామాక్షి స్టీల్స్ భాగస్తుడు జి. రమణా రెడ్డి కుమారుడు సుబ్బారెడ్డి, స్వాతి వివాహం సెప్టంబరు 4 తేదీ నెల్లూరు జరిగింది.

# విదేశీ సంస్థల విషపు పిడికిలిలో స్టేట్ బ్యాంక్ షేర్ విలవిల!

భారతీయ స్టేట్ బ్యాంక్ షేర్ ధరను పతనం చేయడంలో విదేశీ ఇన్వెస్టర్లు విజయం సాధించారు. కొద్ది కాలంలోనే వారు రూ.266లుగా వున్న షేర్ ధరను 206 రూపాయలకు దించి వేశారు. విదేశీ మ్యూచ్యువల్ ఫండ్స్ ఈ కుట్రలో కీలకపాత్ర వహించాయి. అందుకు కారణం స్టేట్ బ్యాంక్

> ## షేర్‌లోకం
> ✣
> డా. ఎ. దుర్గాప్రసాద్

త్వరలోనే 1400 కోట్ల కోసం జీడిఆర్ ఇష్యూ విడుదల చేయనుండడమే. ఆ ఇష్యూ జారీ తేది నాటికి షేర్ ధర పడగొట్టి, చవకగా బ్యాంకుపై పెత్తనం చేయగల్గినన్ని షేర్ల కొనుగోలు చేయాలన్నది వారి పథకం.

దొంగలు పడిన ఆరునెలలకు కుక్కలు మొరిగినట్లు చిదంబరం ఇప్పుడు కళ్లు తెరిచారు. యుటిఐ, ఎల్ఐసిల ద్వారా షేర్ల కొనుగోలు ప్రారంభింప జేశారాయన. స్టేట్ బ్యాంకు షేర్లను విదేశీ సంస్థలు ఇక కొనడానికి లేదని ఉత్తర్వు చేశారు. ఈ పని ముందే చేసి వుంటే ఈ పరిస్థితి వచ్చేదే కాదు.

### ప్రమాదంలో రెండు ఆంధ్ర కంపెనీలు

స్టేట్ బ్యాంకు వలెనే ఆంధ్రకు చెందిన రెండు కంపెనీలపై పెత్తనానికి విదేశీ సంస్థలు కుట్రలు పన్నుతున్నాయి. నాగార్జున కన్‌స్ట్రక్షన్స్, సత్యం కంప్యూటర్స్ కంపెనీల ధరలను పతనం చేస్తున్నారు. మొదటిది 120 నుంచి 80 రూపాయలకు; రెండవది 55 నుంచి 32 రూపాయలకు పడిపోయింది. ఈ రెండు కంపెనీలూ రాబోయే రోజులలో మంచి ఫలితాలు ప్రకటించే స్థితిలో వున్నాయి. అందువల్లే వాటిపై విదేశీయుల కళ్లు పడ్డాయి. ఆర్థిక మంత్రి ఈ రెండు కంపెనీల షేర్ల లావాదేవీలపై కూడా ఆంక్షలు ప్రకటించి కొంత వరకు కాపాడారు.

# చిరునామా చెప్పని కంపెనీపై సందేహాలు రేకెత్తడం సహజం

నాగార్జున జియో గ్రూప్ సంస్థ ఫిక్సెడ్ డిపాజిట్ల సేకరణపై జమీన్ రైతులో గత రెండు వారాలుగా వెలిబుచ్చిన సందేహాలు, ప్రశ్నలకు సమాధానా లివ్వడం మాని; జమీన్ రైతు పత్రికపై దుష్ప్రచారాలు చేస్తున్నారు ఆ కంపెనీ యజమానులు. అటువంటి దుష్ప్రచారాల వల్ల పత్రికకు జరిగే నష్టం ఏదీ లేదు; కాని ఆ రూపంలో తమ తప్పులు కప్పి పెట్టి డిపాజిటర్లను మభ్య పెట్టడానికి ప్రయత్నించడమే ప్రమాద కరమైన విషయం. జమీన్ రైతు తమ సంస్థను ప్రకటన లివ్వవలసిందిగా కోరినట్లు; అందుకు తాము నిరాకరించడంతో ఈ వార్తలు వ్రాస్తున్నట్లు చెప్పి, డిపాజిటర్లను మభ్య పెడుతున్నారు వారు. కాని, ఏ దశలోనూ, ఏ పరిస్థితులలోనూ పత్రిక తరపున వారిని ప్రకటనలు కోరడం జరగ లేదు. అటువంటి మోసపూరిత మైన కంపెనీల ప్రచారానికి – జమీన్ రైతు ఎప్పుడూ వేదిక కాదు. అటువంటి వారిని ప్రకటన లడిగే పొరపాటు ఎప్పుడూ చేయలేదు. అది పోనీండి!

తాము డిపాజిట్ తిరిగి చెల్లించడంలో ఆలస్యం చేసినట్లు లేదా తిరిగి ఇవ్వలేక పోయినట్లు రుజువు చేస్తే లక్ష రూపాయల బహుమతి ఇస్తామని ప్రకటించారు వారు. డిపాజిట్ దారులలో నమ్మకం కల్గించ డానికి ఈ మాత్రం ప్రకటనలు అర్థం చేసుకో దగినవే. కాని, అటువంటి వైఫల్యాలు వారి వద్ద కోకొల్లలుగా వున్నాయి. ఈ వార్త పైన వున్న చెక్కు ప్రతి ఫోటో చూడండి. కేవలం 12 వేల రూపాయల డిపాజిట్ తిరిగి చెల్లించడం వారి కలిపి కాలేదు. ఒకటికి రెండు సార్లు బ్యాంకు నుంచి డబ్బు లేక (Insufficient Funds) అంటూ తిరిగి వచ్చిన చెక్కు కాపీ అది. సెప్టెంబర్ 20 తేది

> **నాగార్జున జియో యజమానులు దుష్ప్రచారాలతో తప్పులు దాచిపెట్టుకోను యత్నిస్తున్నారు**

జమీన్ రైతులో వార్త ప్రచురించాక ఒక పర్యాయం హడావుడిగా ఆ డిపాజిట్ దారునికి 12 వేల రూపాయలు రొక్కంగా చెల్లించారు. రెండో చెక్కులోని 17,570 రూపాయలకు గాను సెప్టెంబరు 23 తేది 5 వేలు, 26 తేది 2,500, 27 తేది మిగతా మొత్తం చెల్లించారు. ఈ డబ్బులు చెల్లించే దానికి రీజనల్ మేనేజర్‌పై, అతని స్నేహితుడొకరు తీవ్రమైన వత్తిడి చేయాల్సి వచ్చింది.

అటువంటి ప్రకటనలతో కాలం గడపడం తప్ప – డిపాజిట్ దారులకు తాము ఎరగా చూపుతున్న అధిక వడ్డీలు తమకే రూపంలో వస్తున్నదీ; ఏ వ్యాపారంలో తాము ఆ పెట్టుబడులు పెడుతున్నదీ వారు వెల్లడించడం లేదు. తమ వ్యాపారాల వివరాలపై వారు ఒక ప్రెస్ నోట్ పంపారు.

నాగార్జున జియో గ్రూపు సంస్థ

కొరవ 8 పేజీలో

06/01/1996

Pay SHAIK JEELANI BASHA ——— या धारक को or Bearer

रुपये Rupees TWELVE THOUSANDS NINE HUNDRED SIXTY ONLY ——— अदा करें Rs. 12,960/-

A/c No. 2116

बैंक ऑफ बड़ौदा
Bank of Baroda
NELLORE BRANCH - 524 001 (Andhra Pradesh)

The Vysya Bank Ltd; PAPPULA STREET, 10 SEP, NELLORE-2. CLEARING

(1)

For Rao Investments,
[signature]

CA/94/GL No. 159437

Code No. 20 | 980

097 | 12 17/06/1997

PAY SK. JEELANI BASHA ——— या धारक को OR BEARER

रुपये RUPEES Seventeen thousand five hundred seventy only ——— अदा करें ₹Rs. 17,570/-

(2)

तमिलनाड मेर्कन्टैल बैंक लिमिटेड
TAMILNAD MERCANTILE BANK LTD.
தமிழ்நாடு மெர்கன்டைல் பேங்க் லிமிடெட்
NELLORE - 524 002

No. NLE/E 677250

(3)

**Bank of Baroda**
(HEAD OFFICE: MANDVI, BARODA)

______ Branch Date 10.09.1996

Cheque No. 159437 for Rs. 12960/- returned unpaid for reason No. 19 A

19. Refer to drawer (19a) Insufficient funds (19b) Account closed.
20. Payment stopped by the drawer (20a) Cheque number differs (20b) Cheque crossed to two Banks (20c) Please present this cheque on the counter for encashment (20d)

# సిబిఐ రోత పట్టిపోయింది!

దేశంలో అత్యంత కీలక నేరపరిశోధన సంస్థ – సిబిఐపై ఒకే రోజు ఢిల్లీ, పాట్నా హైకోర్టులు చేసిన వ్యాఖ్యలు ఆ సంస్థ విశ్వాస పాత్రతను సందేహంలో పడవేశాయి. కేంద్రం ఆధ్వర్యంలో నడిచే సిబిఐ చాలా బలీయమైన, శక్తివంతమైన సంస్థ. నేర పరిశోధనలో వారి పరిధి చాలా విశాలం; వారి అధికారాలు విస్తృతం. ఆర్థిక నేరాలు, అవినీతి ఆరోపణలు, స్కామ్‌లు, కుంభకోణాలు, హత్యలు, రాజకీయ మారణ కాండలు.... అదీ, ఇదీ అనే తేడా లేకుండా ప్రతి అంశంపైనా దర్యాప్తు జరిపి, నేర నిర్ధారణ చేసే అధికారం వారికి వుంది. సమర్థులు, నిజాయితీ పరులు, చురుకైన వారు ఆ సంస్థలో పరిశోధనాధికారులుగా పనిచేస్తుంటారని ప్రతీతి. అటువంటి అధికారులను ఎంపిక చేసి, అంతర్జాతీయ ప్రమాణాలతో శిక్షణ ఇచ్చి, సంస్థను నడిపిస్తుంటారు. అందువల్లే ఏ రాష్ట్ర ప్రభుత్వాలు క్లిష్టమైన కేసుల దర్యాప్తు వారికి అప్పచెప్తుంటాయి. సంచలనాత్మక కేసులలో రాష్ట్ర పోలీసు యంత్రాంగంపై నమ్మకం లేనప్పుడు సిబిఐని ఆశ్రయిస్తారు. అదీ వారి విశ్వసనీయత; సామర్థ్యం. రాజీవ్ గాంధీ హత్యకేసు దర్యాప్తులో వారి ప్రతిభా, ప్రావీణ్యాలు; సమర్థత, చురుకుదనాలను యావత్ ప్రపంచం ప్రశంసించిన సంగతి తెలిసిందే.

అటువంటి నేర పరిశోధన సంస్థను తమ చెప్పు చేతల్లో నడిచే కీలుబొమ్మగా మార్చి వేయడానికి ప్రయత్నిస్తున్నారు రాజకీయ వాదులు. ప్రధాన మంత్రి దేవగౌడ, మాజీ ప్రధాని శ్రీ పివి నరసింహా రావులు కలిసి తమ వ్యక్తిగత, స్వార్థ ప్రయోజనాల కోసం దీన్ని భ్రష్టు పట్టించేశారు. జెఎంఎం ఎమ్పీలకు ముడుపు లిచ్చిన కేసులో సరైన దర్యాప్తు జరప వలసిందిగా ఒకటికి పదిసార్లు మందలించినా సిబిఐ నేతలు నిర్లక్ష్యం వహించి; అసలు నిజాలు దాచి పెట్టడానికి ప్రయత్నించడంతో విసిగి పోయిన ఢిల్లీ హైకోర్టు ఆ దర్యాప్తు బాధ్యత నుంచి ఆ సంస్థను తప్పించింది. సిబిఐ నుంచే ముగ్గురు అధికారులను ఎంపిక చేసి, తన పర్యవేక్షణలో వారు దర్యాప్తు జరిపి, నివేదిక సమర్పించాలని, సిబిఐ నేతలతో ఎటువంటి ప్రమేయం వుండ కూడదని ఆదేశించింది. ఈ కేసులో పివి నరసింహా రావు కీలకమైన నిందితుడు. ఆయన్ను రక్షించడం కోసమే సిబిఐ అంత నిస్సిగ్గుగా, కోర్టు అభిప్రాయాలు ఖాతరు చేయకుండా వ్యవహరించి ఈ అవమానకర పరిస్థితి తెచ్చుకున్నారు.

బీహార్ గడ్డి కుంభకోణంలో ముఖ్య మంత్రి లల్లూ ప్రసాద్ యాదవ్‌ను కాపాడడానికి దర్యాప్తు నివేదికలు తారుమారు చేసి, నిజాయితీ పరులైన అధికారులను హింసించి, తప్పుడు రిపోర్టు సమర్పించి నందుకు పాట్నా హైకోర్టు సిబిఐ డైరక్టర్ జోగిందర్ సింగ్‌ను తీవ్రంగా అభిశంసించింది. ఈ కేసు దర్యాప్తును ఆయన పరిధి నుంచి తప్పించి, తమ పర్యవేక్షణకు తీసుకొన్నారు న్యాయ మూర్తులు. ప్రధాని దేవగౌడ జోక్యం వల్లే జోగిందర్ సింగ్ అంతగా తన బాధ్యతలు విస్మరించి, ప్రవర్తించారన్నది నిజం. దేవగౌడకు లల్లూ ప్రసాద్ యాదవ్‌ను చూస్తే భయం. తనపైన కేసులు మాఫీ చేయకుంటే రక్తపు ఏరులు ప్రవహింప జేస్తానని ప్రధానిని బెదరించారాయన. పశువులకు పచ్చిగడ్డి సరఫరా చేసినట్లు, రికార్డులు సృష్టించి, 900 కోట్ల రూపాయలు స్వాహా చేసిన ఈ రాజకీయ వాది మద్దతు లేకుంటే ప్రధాని దేవగౌడ పదవి ప్రమాదంలో పడుతుంది. అందువల్ల ఆయన సిబిఐ డైరెక్టర్‌ను బలవంత పెట్టి, కేసు దర్యాప్తును తప్పుదారి పట్టించ డానికి ప్రయత్నించారు.

కోర్టులు అంత తీవ్రమైన వైఖరి నవలంబించ కుంటే ఈ రెండు కేసులూ ఈపాటి కెప్పటికో దుమ్ముకొని పోయి వుండేవనడం వాస్తవం. లఖుభాయ్ పాఠక్ ఛీటింగ్ కేసు, సెంట్ కిట్స్ ఫోర్జరీ కేసు, యూరియా కుంభ కోణం, టెలిఫోన్ల స్వాహా, సుఖ్‌రాం దోపిడీ వంటి వాటన్నింటిలోనూ కోర్టులే నిందితులను బలవంతంగా చట్టం బోనులోకి ఈడ్చుకొని వచ్చాయి. లేకుంటే అవి ప్రజల దృష్టికి కూడా వచ్చి వుండవు; వచ్చినా మంత్రులు, సిబిఐ అధికారులు వాటిని మాఫీ చేసి వుండేవారు.

ఈ పరిణామాల ఫలితంగా ఏర్పడిన పరిస్థితులలో ప్రజలను కలవర పరుస్తున్న అంశాలు రెండున్నాయి. మొదటిది – సిబిఐ వంటి సంస్థలే రాజకీయ వాదుల కుతంత్రాలకు లొంగిపోతే ఇక దేశంలో ఏ నేరంపైన నిజమైన దర్యాప్తు జరుగు తుందని ప్రశ్న; రెండవది – న్యాయ స్థానాలు అత్యుత్సాహంతో పరిపాలనా పగ్గాలు తమ చేతుల్లోకి తీసుకోవడం సమంజసమా అన్న సందేహం. జోగిందర్ సింగ్ వంటి బలహీనులు, రాజకీయ ప్రలోభాలకు తలొగ్గేవారు నేతృత్వం వహించే సంస్థల పట్ల ప్రజలలో విశ్వాసం నిలవదు. ఎన్నికల కమీషన్ తరహాలో; రాజకీయ జోక్యానికి, అధికారంలో వుండేవారి పెత్తనానికి ఆస్కారం లేని స్వతంత్ర దర్యాప్తు సంస్థ ఒకదానిని నెలకొల్ప వలసిన అవసరం వుంది. పలుకుబడి కల్గిన మంత్రులు, పారిశ్రామిక వేత్తలు, నేరస్తుల తప్పొప్పులను నిర్ధారించేందుకు ఇటువంటి స్వేచ్ఛాయుతమైన వ్యవస్థ వుండి తీరాలి.



న్యాయ స్థానాల చురుకుదనంపై దేశ వ్యాప్తంగా ఎంతో వేడివేడి చర్చలు జరుగు తున్నాయి. దీనిపై ప్రత్యేక పార్లమెంట్ సమావేశం జరపాలని కూడా ప్రయత్నిస్తున్నారు. ఒక కోణం నుంచి చూసినప్పుడు న్యాయస్థానాలు పరిపాలనను నిర్దేశించడం తొందరపాటు గానే కన్పిస్తుంది. కాని, పరిపాలనకు బాధ్యులైన వారు తప్పుదారిలో ప్రవర్తిస్తున్నప్పుడు కనీసం కోర్టులైనా వారిని దారిలో పెట్టకపోతే ఈ దేశం అస్తవ్యస్తమై పోవడం ఖాయం. కొన్ని పరిధులలో, పరిమితులలో న్యాయస్థానాలు చురుకుగా వ్యవహరించడం జాతి ప్రయోజనాల దృష్ట్యా అవసరమే!

సిబిఐ నేర పరిశోధనలో నిజాయితీ లోపించి, వారిచ్చే దర్యాప్తు నివేదికలు విశ్వసనీయతను కోల్పోవడం వల్ల, బడా రాజకీయ నేతలను అరెస్ట్ చేస్తే తప్ప, కేసు విచారణ సక్రమంగా జరిగినట్లు ప్రజలు నమ్మలేని పరిస్థితి ఏర్పడింది. ఇది దురదృష్టకర పరిణామం. తప్పు చేసిన నాయకుడ్ని శిక్షించడం ఎంత అవసరమో; తప్పు చేయని రాజకీయ వాదిని రక్షించడమూ అంతే అవసరం. లేకుంటే అకారణంగా కేసులలో ఇరుకొన్న ప్రతి నాయకుడూ అన్యాయంగా బలైపోతాడు. రాజకీయ వ్యవస్థ మనుగడకు, ప్రజాస్వామ్య జీవనానికి భంగకరమయ్యే ప్రమాదా లేర్పడుతాయి. జోగిందర్ సింగ్ వంటి దుర్బలుల వల్ల కలుగుతున్న చేటు ఇది. ఈ విషయంలో సుప్రీం కోర్టే చొరవ చూపి, నేర పరిశోధనకు, నేర నిర్ధారణకు, కోర్టుల ప్రమేయానికి మార్గదర్శక సూత్రాలు ప్రకటించి; ఎవరెవరివి ఏవి పరిధులో, ఏవి పరిమితులో నిర్దేశించడం అవసరం.

---

## జమీన్‌రైతు

11-10-46

పేజీలు:8 వెల:0-1-6

### పాలస్తీనా – అమెరికా

మాండేటు విధానం క్రింద పాలస్తీనాను పాలించే ఇంగ్లాండు తన ఇష్టానుసారంగా పాలనను సాగించ లేకున్నది. ఇంగ్లాండుకు గూడా యూధుల మీద ప్రీతి అయినను, అరబ్బులతో కలహించ లేకున్నది. కారణము – అరబ్బు దేశాల స్నేహం మీదనే తన సామ్రాజ్య రహదారుల భద్రత ఆధార పడి యున్నది. ఒకవేళ బలవంతముగా యూధులకు సహాయము చేయుదమన్నా వ్యయప్రయాసలు జాస్తి; నలిగిన ఇంగ్లాండు భరించలేని స్థితిలో వున్నది.

### ఆదర్శప్రాయమైన విరాళము

హైదరాబాదు నైజాంగారు కాశీ హిందూ విశ్వ విద్యాలయానికి ఒక భూరి విరాళం ఒసంగి, అంతః కలహాలతో బీభత్సమై యున్న దేశానికి ఒక ఊరటను కలిగించి నారు. ఈ ఈవి కొత్త దివాను మీర్జా ఇస్మాయిల్ ఆధ్వర్య కారణము కావచ్చును; ఈ ధనంతో నైజాం పేర ఒక వసతి గృహం నిర్మించ నున్నారు; సిపి రామస్వామి అయ్యర్ నాయకత్వాన తిరువాన్కూరు. రాజ్యాలలో తలమానిక మనిపించు కొన్నట్లు, ఇస్మాయిల్ పాలనలో హిందూ ముస్లిం సఖ్యతకు గట్టి పునాదులు వేసి మార్గదర్శక మగుగాక!

### హరిజన దేవాలయ ప్రవేశం

పొట్టి శ్రీరాములు గారి నిరశన వ్రతంతో నెల్లూరు మండలం మేల్కొనిన దనవలెను. వేణుగోపాల స్వామి ఆలయం హరిజన ప్రవేశంతో పాటు రంగనాయకుల పేట దేవాలయ ట్రస్టీలు కూడా అనుజ్ఞకై ప్రభుత్వమును కోరియున్నారు. పుత్తేరు గ్రామంలో రెండు దేవాలయాలు త్రోవ త్రొక్కినవి. ఇక ఈ మండలంలో ఇతర దేవాలయాలు వెనుకంజ వేయుటం సమంజసమా?

స్వచ్ఛమైన హిందూ మతాన్ని ఉద్ధరించి, తోటి హిందూ సోదరుల కళంకమును బాపి, వారిని సర్వ సమానులు చేయుదురు గాక!

ఆంధ్ర రాష్ట్ర జమీన్‌రైతు
ఆంధ్ర రాష్ట్ర జనాంరైతు
మహాసభలు 16.10.46

ఒంగోలు జయరాం టాకీస్‌లో ప్రారంభకులు: ఆచార్య రంగ

## 50 ఏళ్ళ క్రితం ఈ వారం

నాయకులు గారు. గోగినేని లక్ష్మీనారాయణ గారు, అధ్యక్షులు: నెల్లూరు వెంకట్రామా నాయుడు గారు. ఆరికపూడి రామనాథం చౌదరి గారు. సభకు ఎల్లరూ వచ్చి జయప్రదము గావించండి.

నాగినేని వెంకయ్య – ఆహ్వాన సంఘాధ్యక్షుడు

కాళహస్తి తాలూకా జమీన్ రైతు మహాసభ బ్రాహ్మణపల్లిలో 13.10.46 ఆదివారం మధ్యాహ్నం 2 గంటలకు. అధ్యక్షులు: డి. మునిరత్నం నాయుడు గారు, ప్రారంభకులు: ఎం. అనంత శయనం అయ్యంగారు, పతాకము: బొడ్డుపల్లి

కొరకు 11 పేజీలో

---

# హైకోర్టు వాతతోనైనా లెక్చరర్లు దారికి వస్తారా?

1985నాటి ఆంధ్రప్రదేశ్ ప్రయివేట్ విద్యా సంస్థల ఉద్యోగుల నిబంధనావళిలోని 19(3)సెక్షన్ లెక్చరర్ల ప్రయివేట్ ట్యూషన్లను నిషేధించింది. ఇటీవల నెల్లూరు జిల్లాలో మహోధృతంగా సాగిన ట్యూషన్ల వ్యతిరేక ఉద్యమానికి 1985నాటి ప్రభుత్వ ఉత్తర్వే ఆధారం. దీన్ని పురస్కరించుకొని విద్యార్థుల ఒత్తిడిపై నెల్లూరులోని ప్రయివేట్ కాలేజిల యాజమాన్యాలు తమ కళాశాలల్లోని లెక్చరర్లకు షోకాజ్ నోటీసులు జారీ చేశాయి. దీని మీదట వి.ఆర్ కళాశాలకు చెందిన ఒక లెక్చరర్ ఆధ్వర్యంలో కొందరు లెక్చరర్లు తాము ట్యూషన్లు చెప్పడాన్ని నిరోధించరాదంటూ హైకోర్టులో స్టే కోసం వెళ్లారు. వేలాది రూపాయలు దీనికోసం వ్యయం చేశారు. కాని రాష్ట్ర హైకోర్టు ట్యూషన్లు చెప్పే లెక్చరర్ల కళ్ళను వాళ్ల వేళ్లతోనే పొడిచింది. లెక్చరర్లు తమ పిటీషన్‌లో - తాము ఉచితంగా ట్యూషన్లు చెప్తున్నామని, ఇందులో ప్రతిఫలా పేక్ష లేనేలేదని ఘంటా పథంగా చెప్పారు. వారు అన్నమాటలను వారికే అప్పజెప్పింది హైకోర్టు! ఉచిత ట్యూషన్లను కాలేజీలోనే రెండు వారాలపాటు నిర్వహించి విద్యార్థుల సంశయాలను నివృత్తి చేయమని ఆదేశిస్తూ, అందుకు అవసరమైన ఏర్పాట్లు చేయమని ప్రిన్సిపాళ్లను కోరింది హైకోర్టు. ఎట్టి పరిస్థితులలోనూ ఇంటి వద్ద ట్యూషన్లు నిర్వహించరాదని హైకోర్టు పిటిషనర్లను ఆదేశించింది. నెల్లూరు లెక్చరర్లు ఇకనైనా బుద్ధిగా మసలు కొంటే మంచిది.

నెల్లూరు — ఒక లెక్చరర్

## జనవాణి

### సినిమా యాక్టర్లు ఎమ్పీలుగా పనికిరారు

పార్లమెంటు సమావేశాల కోసం కొన్ని కోట్లరూపాయల ప్రజాధనాన్ని ప్రభుత్వం ఖర్చు పెడుతుంది. ప్రజాసమస్యలపై ఎమ్పీలడిగే ప్రశ్నలకు జవాబులు చెప్పించేందుకు, ఇతర నిర్వహణ కోసం గంటకు కొన్ని లక్షలు ఖర్చు అవుతున్నట్లు ఇటీవల అధికారులు ప్రకటించారు. సంవత్సరంలో చాలాకొద్ది రోజులు మాత్రమే పార్లమెంటు ఉభయ సభల సమావేశాలు జరుగుతాయి. ప్రజలు గెలిపించి పంపిన ఎమ్పీలు తప్పని సరిగా ఈ సమావేశాల్లో పాల్గొనాలి. కానిచాలా మంది ఆబ్సెంట్ అవుతుండడంతోపార్లమెంటు బోసిపోయి కన్పిస్తున్నది. మన రాష్ట్రం నుంచి అధికార తెలుగు దేశం పార్టీ నుంచి ఎన్నికైన సినిమా యాక్టర్లు పార్లమెంటులో అసలు కనిపించడం లేదు. రాజ్యసభ సభ్యురాలు, సినీనటి జయప్రదగారు ఒక ప్రశ్న వేసి, సంబంధిత జవాబు చెప్పె

కొరకు 10 పేజీలో

# రచ్చతో బ్రిడ్జి బాగుపడదు - ముఖ్యమంత్రి ఉత్తర్వే మోక్షసాధనం!

విజయ మహల్ రైల్వే క్రాసింగ్ వద్ద నిర్మించిన బాక్స్ టైప్ బ్రిడ్జికి అప్రోచ్ రోడ్ల నిర్మాణం ఇప్పట్లో పూర్తయ్యేట్లు లేదు. దీనిపై ఉన్నం బనవయ్య ధర్నాలు, ప్రదర్శనలు జరపడంతో ఆ నింద తనపై పడుతుందని భయపడి, మునిసిపల్ ఛైర్మన్ శ్రీ ఆనం వివేకానంద రెడ్డి తెలివిగా ఆ బనవయ్యతో సహా పదిమంది కౌన్సిలర్లను వెంట బెట్టుకొని హైదరాబాదు వెళ్లి, మునిసిపల్ మంత్రిని, ప్రిన్సిపల్ కార్యదర్శి అర్జున రావును, నెల్లూరు మంత్రి రమేష్ రెడ్డిని కలిసి వచ్చారు.

అక్కడ వారికేమీ సానుకూల ప్రతి స్పందన ఎదురైనట్లు లేదు. బ్రిడ్జికి తూర్పు వైపు వున్న కొన్ని ప్రైవేటు స్థలాలు రోడ్డు నిర్మాణానికి ఆటంకంగా వున్నాయి. ఆ స్థలం విలువ కాని, లేదా అందుకు ప్రత్యామ్నాయ స్థలం కాని ఇస్తేనే వారు ఆ స్థలం స్వాధీనం చేస్తారు. ఆ ఫైలు ప్రభుత్వం దగ్గర పెండింగ్‌లో వుంది. దాన్ని కదిలించగానికి మంత్రి రమేష్ రెడ్డి సహాయం అర్థించారు వీరు.

అర్జున రావు వంటి పెద్దసరపు కొప్పులతో పెగడం అంత సులువు కాదు. ముఖ్య మంత్రులతో ఆయన కొరుకు పడరు; పాపం, రమేష్ రెడ్డి ఏమి చేయగలరు?

ఈ బాక్స్ టైప్ అండర్ బ్రిడ్జి సిపిఎం పార్టీ రాజకీయ ప్రతిష్ట సమస్యగా మారిపోయింది. ఎట్లయినా దాన్ని తాము పూర్తి చేయించినట్లు చెప్పుకోజూస్తుంది. బ్రిడ్జి నిర్మాణం

**నెల్లూరు సంగతులు**

తలపెట్టినప్పుడే అప్రోచ్ రోడ్డుకు కావలసిన స్థలం విషయంలో సర్వే జరిపి వుంటే ఈ పేచీ వచ్చేది కాదు. అప్పుడు హడావుడిలో ఆలోచన లేకుండా బ్రిడ్జి కట్టేశారు. దానికి తూర్పు వైపు వుండేది ప్రైవేటు స్థలం. దానికి అక్విజిషన్ ప్రయత్నమే జరగలేదు. ఇప్పుడు మొదలు పెడితే - చట్టం ప్రకారం కనీసం ఆరు నెలల వ్యవధి పడుతుంది. అది, విలువైన స్థలం, అంత ఖరీదు చెల్లించడానికి కొనడానికి ప్రభుత్వం అంగీకరించడం చాలా కష్టం. ఆ స్థలం బదులు వేరే స్థలం ఇవ్వడమే దీనికి మార్గం. గతంలో మద్రాసు బస్టాండు దగ్గర కె.వి.సుబ్బారెడ్డి పెట్రోలు బంకు విషయంలో అధికారులు ఆ నిర్ణయమే తీసుకొన్నారు. ఇప్పుడూ అదే పద్ధతి

నవలంబించి, జిల్లా మంత్రి రమేషరెడ్డి వంటి వారు పూనుకొని, ముఖ్యమంత్రిని ఒప్పించి, ఉత్తర్వులు జారీ చేయించడమే ఈ సమస్యకు తరుణోపాయం.

ప్రయత్నం ఆ మార్గంలో వుండాలి కాని; ధర్నాలు, ప్రదర్శనలతో సమస్య పరిష్కారం కాదు.

# నెల్లూరులో రైళ్లు నిలపాలంటే ఎమ్మీవ్గారు యుద్ధం చేయాల్సినట్లుంది?

దేముడు వరమిచ్చినా, పూజారి అర్థగించినట్లు - నెల్లూరులో కోరమండల్, మంగళ రైళ్లు నిలిపే విషయంలో రైల్వే మంత్రి పాశ్వాన్ అంగీకరించినా, అధికారులు విన్పించు కోవడం లేదని నెల్లూరు పార్లమెంటు సభ్యురాలు శ్రీమతి పనబాక లక్ష్మి ఆరోపించారు. వారు తమ ప్రవర్తన మార్చుకోకుంటే ఆందోళన చేస్తానని ప్రకటించా రామె.

ఇందులో అధికారుల తప్పువున్నట్లు లేదు. రైల్వే మంత్రి గారే తలతిక్క మనిషిగా వున్నట్లున్నారు. తన పి.ఎ లేదా పిఎస్‌లు విడుదల చేసే ఏ ఉత్తర్వు, దానిపై తన సంతకం వున్నాసరే వారు పట్టించు కోనవసరం లేదని ఆయన రైల్వే జిఎం లందరికీ రహస్య సర్క్యులర్ జారీ చేశారట. తిరుపతి ఎమ్పీ ఎన్.సుబ్రహ్మణ్యం ఈ చిదంబర రహస్యం కనిపెట్టారు. అంటే రైళ్ల స్టాపింగ్‌కి సంబంధించి లక్ష్మికిగారికి మంత్రి ఇచ్చిన అంగీకారం కూడా ఈ చెల్లని చిత్తు కాగితాల జాబితాలో చేరిపోయి ఉంటుంది. పాపం అధికారులేమి చేస్తారు? ఎమ్పీ లిద్దరూ కలసి రైల్వే మంత్రిని ఢిల్లీలో నిలేయాల్సిన విషయమది.

**తన ఉత్తర్వులు ఖాతరు చేయవద్దని తానే ఉత్తర్వు చేశాడట రైల్వేమంత్రి**

### రామకృష్ణ కవితల ప్రచురణకు సాయం

ఆంధ్రప్రదేశ్ తెలుగు విశ్వవిద్యాలయం విస్తరణ సేవా విభాగం గ్రంథ ప్రచురణకు ఆర్థిక సహాయం పథకం క్రింద నెల్లూరు కవికి సహాయం అందించింది. వాణిజ్య పన్నుల శాఖలో సీనియర్ అసిస్టెంట్‌గా పనిచేస్తున్న పెరుగు రామకృష్ణ రచించిన గేయ కవితా సంపుటి 'వెన్నెల జలపాతం' ప్రచురణకు 2 వేల రూపాయలు మొత్తాన్ని మంజూరు చేసింది. రామకృష్ణ దశాబ్దానికి పైగా వివిధ పత్రికలలో, ఆకాశవాణిలో ప్రసారమైన కవితలని వెన్నెల జలపాతం పేర గ్రంథంగా వెలువరిస్తున్నారు.

# శ్రీనాధుడి పద్యం అర్థంకాకున్నా వింటే ఆనందం కలుగుతుంది!

శ్రీనాథ మహాకవి జయంతి సభ 2వతేది టౌన్‌హాలులో వర్ధమాన సమాజం యాజమాన్యాన జరిగింది. అధ్యక్షత వహించిన మోపూరు వేణుగోపాలయ్య మాట్లాడుతూ కవిసార్వభౌముడైన శ్రీనాధుడు ప్రబంధ కవులకు మార్గ దర్శకుడు. ఆయన రచించిన శృంగార నైషధం, హరవిలాసాది కావ్యాలు ఆంధ్ర ప్రబంధాలకు మేలు బంతులన్నారు. ప్రధానోపన్యాసకుడు ఆచార్య రవ్వా శ్రీహరి విద్వత్కవి శ్రీనాథునిలో, ఆయన రచనలలో రాజసం, గాంభీర్యం కన్పిస్తుంది. తెలుగులో శ్రీనాథుడివలె శాస్త్ర పండితుడైన కవి మరొకరు లేరు. సంస్కృతాన్ని మూలంగా పెట్టుకొని తెలుగులో విజృంభించిన శ్రీనాథుడి కవిత్వంలో చదివించే గుణమైన శ్రవణ సుభగత్వం పుష్కలంగా వుంది. శ్రీనాథుని పద్యం అర్థం కాక పోయినా వినే వారికి ఆనందం కలిగిస్తుంది. ఒకచోట ప్రౌఢి పలికించి, మరోచోట నుడికారం చిలికించి శ్రీనాథుడు సీసాలు రచించడంలో అందెవేసిన చేయిగా అన్నారాయన. సభాపోషకులు నరేంద్రరెడ్డి వక్తను ఘనంగా సన్మానించారు. అగస్త్యరెడ్డి వెంకటరెడ్డి వక్తను సభకు పరిచయం చేశారు. వర్ధమాన సమాజం కార్యదర్శి పొన్నాల రామసుబ్బారెడ్డి స్వాగతం చెప్పి, వందనాలు చెల్లించారు.



### "ఇంటింటికి తిరిగి సభ్యత్వం చేర్పిస్తాం"

కాంగ్రెస్ పార్టీకి సంబంధించి టౌన్‌లో నూతన సభ్యులను చేర్పించే కార్యక్రమాన్ని మునిసిపల్ ఛైర్మన్ ఆనం వివేకానందరెడ్డి, మాజీ ముఖ్యమంత్రి నేదురుమల్లి జనార్ధనరెడ్డి సూచనల ప్రకారం సభ్యత్వపు కార్యక్రమాన్ని సైద్ధాంతికంగా, శాస్త్రీయంగా నిర్వహించ బోతున్నామని చెప్పారాయన. నెల్లూరు పార్లమెంటు సభ్యురాలు శ్రీమతి పనబాక

కొరవ 11 పేజిలో

తుమ్మల శ్రీనివాసులు రెడ్డి కుమారుడు సునీల్ కుమార్ రెడ్డి, నీరజ; వివాహం సెప్టెంబర్ 8 తేది నెల్లూరులో జరిగింది.

# సణుగుడు

* జిప ఛైర్మన్‌ను దిష్టిబొమ్మగా పెట్టి తాము పెత్తనం చేయాలను కొంటున్నారా?

* ఈ డాక్టర్లను హంతకులుగా ఎంచి ఉరివేసినా పాపం చుట్టుకోదు

* జిల్లామంత్రులను మార్చి న్యూ సెన్స్ కొనితెచ్చుకొంటాడా చంద్రబాబు?

జిల్లా పరిషత్ ఛైర్మన్ డాక్టర్ ఎన్. నాగభూషణమ్మను దిష్టి బొమ్మగా పెట్టి, తమ పెత్తనం చలామణి చేసుకోవడానికి జిప సభ్యులు చేస్తున్న ప్రయత్నం చాలా అభ్యంతరకరమైనది. వీరెందుకంత పొరపాటు పనికి పూనుకొంటున్నారో అర్థం కావడం లేదు.

నాగభూషణమ్మ గత వేసవి టీచర్ల బదిలీలలో అవినీతికి పాల్పడింది నిజం. సిగ్గు విడిచి, బరితెగించి టీచర్ల బదిలీలు విక్రయించారామె. దాన్ని ఖండించాల్సిందే; నివారించాల్సిందే! అయితేపత్రికల రచ్చవల్లో, సభ్యుల ఆందోళనవల్లో, అధికారుల అప్రమత్తత వల్లో ఆ అవినీతి కార్యం విఫలమైంది. ఆయ్యేవార్లకు ఇటు కోరిన బదిలీ ఉత్తర్వులు చేతికందలేదు; అటు ఇచ్చిన లంచం పూర్తిగా వెనక్కు తిరిగి రానూ లేదు.

ఈసాకు చూపి, జిప వ్యవహారాలన్నింటిలో ఆమెను నిర్వీర్యురాలిని చేయాలను కున్నట్లుంది సభ్యులు. అది తప్పు. పనుల మంజూరు, కొత్త టీచర్ల అలాట్‌మెంట్ తదితరాలన్నీ తామే చేస్తామని, తమరు కుర్చీలో కూర్చుని చూస్తుండండని ఒత్తిడి చేస్తున్నారు వీరామెను. దీన్ని ఘరానా బ్లాక్ మెయిల్ అనడం తప్పుకాదు. ఆ పరిస్థితులలో ఇక ఆ కుర్చీలో ఛైర్మన్ వుండడం ఎందుకు? స్థానిక సంస్థలలో సభ్యుల పరిధి - సమావేశాల వరకే! నిత్య పరిపాలన హక్కు ఛైర్మన్‌ది! ఆ హక్కులను లాక్కోవాలని చూడడం ప్రజాస్వామ్య నియమాలకు విరుద్ధం.

నాగభూషణమ్మ ఆ కుర్చీకి తగనిదని సభ్యులు భావిస్తే - అవిశ్వాస తీర్మానం పెట్టి దించేయ వచ్చు; ఆమె అవినీతి పరురాలని నిర్ధారణైతే - విచారణ జరిపించి, శిక్షించవచ్చు. అంతే తప్ప ఈ బెదిరింపులు సమంజసమెట్లా అవుతాయి? ఈ స్థానంలో హరిజన మహిళ బదులు మరొకరు వుంటే సభ్యులు అంత సాహసం చేయగలరా?

అయితే నాగభూషణమ్మ గండ్రా గొండి; ఈ ఉడుత ఊపులకు చలించేంత బలహీనురాలు కాదు. అందువల్లే ఆమె అంత ధైర్యంగా ఏటికి ఎదురీద గల్గుతున్నారు. జిల్లాలోని ఎమ్మెల్యే లందరూ ఆమెకు వ్యతిరేకం; జిప సభ్యులందరితోనూ ఆమెకు పేచీ; అధికారులతో సత్సంబంధాలు లేవు; అయినా ఆమెలో చింత కన్పించదు. మహిళలు బలహీనులనే మాట ఆమెకు వర్తించదు. పురుషులు తలదించాల్సిందే తప్ప, ఆమె మెడ వంచలేరు. ఇంత పటిష్టమైన మానసం కల్గిన ఆమె - అంత అవినీతి పరురాలెట్లా అయిందో అర్థం కాదు.

**డోలేంద్ర**

***

హైదరాబాద్‌లో జూనియర్ డాక్టర్లు జరిపిన సమ్మె వైద్య వృత్తికే కళంకం ఆపాదించిన దుర్ఘటన. ఒకే ఒక్క ఆస్పత్రిలో ఈ సమ్మెవల్ల నలభై పసిప్రాణాలు బలైపోయాయి. వందలాది మంది గర్భిణులు నరక యాతన చవిచూచారు. పేద ప్రజానీకం అల్లాడిపోయింది. కడుపు నొప్పి వచ్చినా, కాలు విరిగినా, కన్ను దెబ్బతిన్నా, జ్వరంతో శోషవచ్చి పడిపోయినా చూసేదిక్కు లేక, చికిత్సకు నోచుకోక వారనుభవించిన యాతన వర్ణనాతీతం.

ఇందర్ని ఇన్ని విధాల చంపుకు తినడానికి కారణం - ఒక జూనియర్ డాక్టర్‌పై ఒక పసికందు తండ్రి చేయి చేసుకోవడం; ఆ కన్న తండ్రి కడుపు -మంటకు కారణం ఆ డాక్టరు నిర్లక్ష్యంతో, సకాలంలో వైద్యం అందించక అన్యాయంగా ఆ పసికందును చంపడం! కళ్ళ ముందు కన్న బిడ్డ కన్నుమూసిన దుఃఖంలో; ఆ చావుకు డాక్టర్ సోమరితనం కారణమన్న ఆక్రోశంతో అతడు, ఆవేదితో వచ్చిన

కొరవ 12 పేజిలో

# గూడూరు పసికందు దారుణహత్య కేవలం డబ్బు కోసమేనా?

సినిమాలు, పుస్తకాల ప్రభావానికి లోనైన యువకుడు. కిడ్నాప్ చేసి సులభంగా డబ్బు సంపాదించాలన్న దురాశతో ఒక పసిపిల్లవాడి ప్రాణాలు నిర్దాక్షిణ్యంగా తీశాడు. ఈ ఘటన గూడూరులోని సూర్యా లాడ్జిలో సెప్టెంబరు 30తేది జరిగింది. చెన్నూరు గ్రామస్తులైన తిరకాల హనుమంతరావు కొడుకు శ్రీకాంత్ ఇంటర్మీడియట్ ఫెయిలై జాలాయిగా తిరుగుతుండే వాడట. తండ్రి శ్రీకాంత్‌కు ఒక మెడికల్ షాపు కూడా పెట్టించాడు. తండ్రి చేసిన అప్పులు పెళ్లికి ఎదిగిన చెల్లెలు. శ్రీకాంత్‌లో మరెంత డబ్బును సంపాదించాలన్న దురాశ రేపాయి. హారర్ సినిమాలు డిటెక్టివ్ పుస్తకాలు చదవడం అలవాటున్న శ్రీకాంత్ డబ్బు సంపాదించడానికి ఎవరయినా బాలుడ్ని కిడ్నాప్ చేయటమే సరైన మార్గం అనుకొన్నాడు. ఆ గ్రామానికి చెందిన వేజర్ల శ్రీమన్నారాయణ పెద్ద కుమారుడు చైతన్యను ఇందుకు లక్ష్యంగా ఎంచుకున్నాడు. ఈ పథకం అమలుపర్చను గూడూరులోని సూర్యా లాడ్జిని వేదికగా ఎంచు కొన్నాడు. జి. సూర్యా, పట్టాభి గార్డెన్స్, వైజాగ్ అనే దొంగ అడ్రస్ వ్రాసి రెండు రోజులకు రూమ్ తీసుకొన్నాడు. గూడూరు టాక్సీ స్టాండ్‌లో ఒక టాక్సీని బాడుగకు తీసుకొని చైతన్య చదివే చిల్లకూరులోని కాన్వెంట్‌కు వెళ్లాడు. మూడవ తరగతి చదివే చైతన్య తండ్రికి ఆరోగ్యం సరిలేదని గూడూరు ఆసుపత్రిలో వున్నాడని అర్జెంటుగా చైతన్యను తీసుకెళ్లాలని కరస్పాండెంట్‌ను కలిశాడు. తాను చైతన్య తండ్రి నిర్వహించే షాపులో గుమస్తానని నమ్మబలికాడు. కాని కరస్పాండెంట్ కుటుంబ సభ్యులు ఎవరో ఒకరు చెప్తేగాని స్కూలు నుంచి బాలుడ్ని పంపనన్నాడు. శ్రీకాంత్ తెలివిగా బయట నుంచి గొంతు మార్చిఫోన్ చేసి కరస్పాండెంట్‌ను ప్రక్కదోవ పట్టించాడు. చైతన్యను కారులో గూడూరు లాడ్జికి తీసుకెళ్లాడు.

చైతన్యను అమాట ఈ మాట చెప్పి నవ్వు చెప్పాలని చూశాడు. బాలుడు ఇంటికి పోవాల ఎరుపు లంఘించుగానే సరికి తన పథకం ఎక్కడ విఫలమై పోతుందోనని భావించి చైతన్యను హత్య చేయాలనే నిర్ణయానికి వచ్చేశాడు. ముందే తెచ్చుకొన్న వైరును మెడకేసి లాగాడు. తరువాత మచ్చుకత్తితో బాలుడి తలపై వెనుకవైపు నుంచి ఒక దెబ్బవేసి, రాక్షసుడిలా మారి, చైతన్యను ఖండఖండాలుగా చేశాడు. తాపీగా ఆ రూంలోనే స్నానం చేసి, బట్టలు మార్చుకొని ఏమాత్రం తడబడకుండా లాడ్జి రూంకు తాళాలు వేసి గూడూరు రైల్వే స్టేషన్‌కు వచ్చి వైజాగ్‌కు టిక్కెట్ తీసుకొన్నాడు. కాని ఎందువల్లోమనసు మార్చుకొని నెల్లూరులో దిగి సినిమా చూశాడు. తరువాత మచిలీ పట్నం

**ఎంత ఘోరం? ఎంత రాక్షసత్వం**

బస్సు ఎక్కిన హంతకుడు చిలకలూరిపేటలో దిగాడు. అక్కడ నుండి విజయవాడ, శ్రీకాకుళం వెళ్లాడు. శ్రీకాకుళంలో బంధువుల అడ్రస్ దొరకక మళ్లీ నెల్లూరు వస్తూ రైల్వే స్టేషన్‌లో పోలీసుల చేతికి చిక్కిపోయాడు.

స్కూలు కరస్పాండెంట్ అంత జాగ్రత్త తీసుకున్నా ఈ హత్య జరిగి పోవడం కేవలం దురదృష్టం. ఆ దుర్మార్గుడు కేవలం డబ్బు కోసం ఈ ఘోరం చేశాడంటే నమ్మకం కలగడం లేదు. లాడ్జి రూంలో పిల్లవాడు ఏడ్చినప్పుడు, తాను చెప్పినట్లు క్రైం పుస్తకాలు చదివే వాడైతే మత్తుమందు ఇవ్వడమో లేదా నోరు కట్టి పడేయడమో చేయాలి. కనీసం ఆ పిల్లవాడి తండ్రికి ఫోన్ కూడా చేయకుండా చంపి పారేయడం చూస్తుంటే వాడి వుద్దేశ్యం అదిగా కన్పించడం లేదు. మెడికల్ షాప్ నడిపిన వాడికి మత్తుమాత్రలు పెద్ద కష్టం కాదు. ఈ హత్యోదంతం గూడూరు ప్రాంతంలో సంచలనం సృష్టించింది.

## సేవా సంస్థ జరిపిన గాంధీ జయంతి

కావలి అభ్యుదయ సేవా సంస్థ గాంధీ జయంత్యుత్సవాన్ని హ్యాండ్‌లూమ్ క్లాత్ మర్చంట్స్ అసోసియేషన్ హాలులో 2తేది ఘనంగా జరిపింది. స్టేట్ బ్యాంక్ కావలి బ్రాంచి మాజీ ఛీఫ్ మేనేజర్ రామ్మూర్తి సభను అధ్యక్షించారు. కావలి ఆర్డీఓ రఘునందనరావు, డిఎస్పీ జి.రవీంద్రరెడ్డి ముఖ్య అతిథులుగా విచ్చేసి మాట్లాడారు. ఆర్డీఓ మాట్లాడుతూ దేశ పురోభివృద్ధికి ఉద్యోగస్తుల సేవలు అవసరమని, ప్రభుత్వ ప్రశంసలు పొందిన వారిని సత్కరించడం మంచి సంప్రదాయమన్నారు. డిఎస్పీ మాట్లాడుతూ అభ్యుదయ సేవా సంస్థ నిర్వహిస్తున్న ప్రతి కార్యక్రమంలో పాల్గొనడం ఆనందంగా ఉందన్నారు. బ్యాంక్ అధికారులు యం.జి.కె. మూర్తి, పార్థసారథి, సబ్ ఇన్‌స్పెక్టర్ రాంబాబు, ఆర్టీసి గ్యారేజ్ మెకానిక్ నరసింహారావును ఆర్డీఓ సత్కరించి, జ్ఞాపికలు బహూకరించారు. ఈ సందర్భంగా నిర్వహించిన వ్యాసరచన, వక్తృత్వ పోటీల్లో విజేతలకు డిఎస్పీ రవీంద్రరెడ్డి బహుమతి ప్రదానం చేశారు. సేవా సంఘం కార్యదర్శి ఎం.మోహనరావు తొలుత స్వాగతం చెప్పగా, అధ్యక్షుడు సోమా శీనయ్య అతిథులకు మెమెంటోలు అంద జేశారు. కార్యవర్గ సభ్యుడు నారాయణ వందన సమర్పణతో సభ ముగిసింది.

నెల్లూరులో వరద బాధితులకు బియ్యం పంపిణీ చేస్తున్న మంత్రిద్వయం బల్లి దుర్గాప్రసాద్, టి. రమేష్ రెడ్డి

# నీటి కరవు మాయం చేస్తాను - మాగుంట పార్వతమ్మ శపథం!

తన పార్లమెంటు నియోజకవర్గంలో మంచి నీటి ఎద్దడి అన్నమాట వినిపించకుండా చేయాలన్నదే తన ప్రధాన కర్తవ్యంగా భావిస్తున్నానని ఒంగోలు పార్లమెంటు సభ్యురాలు శ్రీమతి మాగుంట పార్వతమ్మ వెల్లడించారు. ఇటీవల కొండాపురం మండలం తూర్పు ఎర్రబల్లి గ్రామంలో తన స్వంత ఖర్చుతో వీధి దీపాలు ఏర్పాటుచేసి, వాటిని ప్రారంభించి అనంతరం జరిగిన బహిరంగ సభలో మాట్లాడారు. ఒంగోలు నియోజకవర్గ ప్రజలు ప్రతి ఏటా వేసవి కాలంలో ఎదుర్కొంటున్న మంచినీటి ఎద్దడి తనకెంతో బాధ కల్గిస్తోందన్నారు. నియోజక వర్గ ప్రజల దాహార్తి తీర్చేందుకు తన భర్త స్వర్గీయ సుబ్బరామరెడ్డి బ్రతికి ఉండగా అనేక గ్రామాలకు ట్యాంకర్ల ద్వార మంచినీటిని అందిస్తూ వచ్చారు. ఆయన ప్రస్తుతం మన ముందు లేకపోయినప్పటికి ఆయన ఆశయాలు కొనసాగించాలన్న ఉద్దేశ్యంతో అదనపు ట్యాంకర్లతో నీటిని సరఫరా చేస్తున్నట్లు చెప్పారు. ట్యాంకర్ల ద్వార నీళ్లు సరఫరా చేస్తున్నా సంతృప్తి లేదు. అందువల్ల పార్లమెంటు సభ్యురాలుగా తనకు వచ్చే కేంద్ర ప్రభుత్వ నిధులలో అధిక మొత్తాన్ని మంచినీటి సరఫరాకు కేటాయిస్తున్నామన్నారు.

బాలాజీ గ్రూప్ అధినేత మాగుంట శ్రీనివాసులు రెడ్డి మాట్లాడుతూ తమ గెలుపు కోసం కృషిచేసిన కార్యకర్తలకు ఎల్లవేళలా అండగా వుంటామన్నారు. సభలో మాజీ మంత్రి మాదాల జానకిరాం మాట్లాడిన మాటలు ఆసక్తికరంగా ఉన్నాయి. దేశంలో ఎవ్వరూ నిజాయితీతో బ్రతకలేని వ్యవస్థను మనం నిర్మించు కొన్నాం. అవినీతి గూర్చి రాజకీయ నాయకులు మాట్లాడకుంటే మంచిదని, ఎన్నికల్లో ఎవ్వరూ నిజాయితీగా గెలవడం లేదన్నారాయన. బాలాజీ గ్రూప్ చీఫ్ ఎగ్జిక్యూటివ్ పి.వి. ప్రసన్నరెడ్డి కూడా సభలో మాట్లాడారు.

# అయ్యవార్లులేని స్కూళ్లలో పిల్లల చదువులెట్లా సాధ్యం?

అందరికి విద్య అందించాలని ప్రభుత్వం ఒకవైపు పలుకొత్త కొత్త పథకాలు చేపడుతుంటే, మరోవైపు భర్తీకాని టీచర్ల పోస్టులతో అనంతసాగరం మండలంలో విద్యాప్రమాణాలు అడుగంటి పోతున్నాయి. అనంతసాగరం ఉన్నత పాఠశాలలో ప్రధానోపాధ్యాయుడు రిటైర్ అయ్యి ఐదు మాసాలైనా తిరిగి ఆ

**జిల్లావార్తలు**

పోస్టును భర్తీ చేయలేదు. దీనివల్ల ఆపాఠశాలలో లెక్కలు, ఇంగ్లీషు బోధించే వారే కరవయ్యారు. సామిరెడ్డిపాడు ఉన్నత పాఠశాలలో హెడ్‌మాస్టర్, హిందీ పండిట్, సాంఘిక శాస్త్రం బోధించే ఉపాధ్యాయులు లేక పిల్లలు చదరాని పాట్లు పడుతున్నారు. మండలాధ్యక్షుని స్వగ్రామమైన చిలవలమర్రి ఉన్నత పాఠశాలలో హిందీ పండిట్, సెకండరీ గ్రేడ్ అసిస్టెంట్, పి.ఇ.టి, డ్రాయింగ్ టీచర్ల పోస్టులు మూడు సంవత్సరాలుగా ఖాళీగా ఉన్నాయి. కొత్తపల్లి ఉన్నత పాఠశాలలో సైన్సు, లెక్కలు బోధించే ఉపాధ్యాయుల పోస్టులు ఏడాదిగా ఖాళీగా ఉన్నాయి. ఉప్పలపాడు ఉన్నత పాఠశాలలో ముఖ్యమైన సబ్జెక్టులు బోధించే అయ్యవార్లు లేక గతఏడాది పదవ తరగతి పరీక్షల్లో ఒక్కరూ పాస్ కాలేక పోయారు. అనంతసాగరం మండలాన్ని ఇటీవల విద్యాశాఖ రీజినల్ జాయింట్ డైరెక్టర్ సందర్శించి, విద్యాశాఖ ఈ మండలాన్ని దత్తత తీసుకొంటుందని ప్రకటించారు. దత్తత సంగతి దేముడెరుగు; ముందు స్కూళ్లలో ఉపాధ్యాయులను నియమించి అవి మూతపడి పోకుండా చూడాల్సిన బాధ్యత ఎంతైనా ఉంది.

## "లీగల్ లిటరసీ"ని అభివృద్ధి చేయాలి!

ప్రజలలో న్యాయపరమైన, చట్టపరమైన అవగాహన లేకపోవడంతో ఎన్నో సమస్యలను ఎదుర్కొంటున్నారు. చదువుకున్న వారు సైతం ఇలాగే ఇబ్బందులు పడుతున్నారని అందువల్లే "లోక్ అదాలత్" తరఫున లీగల్ లిటరసీ అనే కార్యక్రమాన్ని చేపట్టదలచినట్లు లోక్ అదాలత్ ఛైర్మన్, కావలి సబ్-జడ్జి జి. శ్యాంప్రసాద్ చెప్పారు.

కొరవ 7 పేజిలో

# వూరకే వుంటే వూరే అమ్మేస్తారేమో కావలి మునిసిపల్ కౌన్సిలర్లు!

కావలి మున్సిపాలిటీని అభివృద్ధి పరుచు కోవడానికిగాను, మున్సిపాలిటి పరిధిలోని విలువైన స్థలాలను అమ్మాలని కావలి కౌన్సిల్ ఇటీవల జరిగిన సమావేశంలో ఏకగ్రీవంగా తీర్మానించింది.

సక్రమంగా పన్నులు, బాడుగలు వసూలు చేసి వినియోగిస్తే ఆస్తులను అమ్ముకోకుండానే అభివృద్ధి చేసుకోగల్గిన కావలి మున్సిపాలిటీ, ప్రభుత్వం జారీ చేసిన ఉత్తర్వు ప్రకారం ఆస్తులు అమ్ము కొనేందుకు తీర్మానం చేసింది. దొంగపనులు చేసి, చేయని పనులు చేసినట్లు చూపించి కావలి మున్సిపల్ కాంట్రాక్టర్లు లక్షలు దోచుకుంటున్నా, కౌన్సిల్‌లో సగానికిపైగా కౌన్సిలర్లే కాంట్రాక్టర్లు కావడంతో తీర్మానాన్ని ఏకగ్రీవంగా ఆమోదించారు.

అయితే ఈ ఆస్తులను అమ్మగా వచ్చే డబ్బును మంచినీటి కోసం, షాపింగ్, ఆఫీసుల కాంప్లెక్సులు, పార్కులు వంటి అభివృద్ధి పనులకు ఖర్చు చేయాలని ప్రభుత్వం వివరణ ఇచ్చింది. కాని వేసవి జలాశయానికి కేటాయించే ప్రయత్నం చేస్తున్నారని, ఈ డబ్బును రాష్ట్ర ప్రభుత్వం విడుదల చేయాలని వైస్ ఛైర్మన్ గ్రంథి యానాదిశెట్టి ధ్వజమెత్తారు. కావలి మున్సిపాలిటీలో మంచినీటి వనరుల కోసం కేంద్రం 22 లక్షలు మంజూరు చేసి వాటిని వేసవి జలాశయం కోసం మున్సిపల్ కోటాలో జమచేశారని యిక మిగిలిన 8లక్షల కోసం ఆస్తులు అమ్మి జలాశయానికి కేటాయించాల్సిన అవసరం లేదని ఆయన వాదన.

మున్సిపల్ కార్మికులు చనిపోయినా, రిటైరయిన వారికి రావాల్సిన మొత్తాలు రావడం లేదని దీనితో కుటుంబాల వారు రోడ్డున పడే

**టౌన్‌ను అమ్మివేయనిదే అభివృద్ధి చేయలేరా?**

పరిస్థితి ఏర్పడిందని కో-ఆప్షన్ మెంబర్ ఎస్. మాలకొండయ్య ఆవేదన వ్యక్తం చేశారు.

మున్సిపల్ కౌన్సిల్ ఆమోదం పొందకుండా, ఛైర్‌పర్సన్ ఆదేశాలతో ప్రజా పనులశాఖ ఆధ్వర్యంలో పనులు చేస్తున్నారని యిప్పటికి 19పనులు చేపట్టారని ఇవన్నీ తమ తమ వార్డులలో జరిగే విధంగా ఇష్టం వచ్చినట్లుగా కాంగ్రెస్ వారు కేటాయించు కున్నారని బి.జె.పి కౌన్సిలర్ ఆరోపించారు. అటువంటిదేమి లేదని వార్డుల వారీగా పనులు జరుగుతున్నాయని వైస్ ఛైర్మన్ చెప్పగా, సభలో గందరగోళం ఏర్పడింది. బి.జె.పి. కౌన్సిలర్ పి.చిట్టిబాబు, తెలుగుదేశం కౌన్సిలర్ ఆవుల వెంకటరత్నంలు కలిసి పనుల కేటాయింపులు సక్రమంగా లేవని నిరూపిస్తే వైస్-ఛైర్మన్ రాజీనామా చేయాలని కోరారు. ఈ దశలో తెలుగు దేశం కౌన్సిలర్ రత్నం మాట్లాడుతూ 24వవార్డు పుట్టినప్పటి నుండి మూడు విద్యుత్ బల్బులు తప్ప మరింకేమి సమస్య పరిష్కరించ లేదని ఛైర్మన్‌ను నిలదీశారు.

## రికో ఎన్నికలు 27న

ఆత్మకూరు గ్రామీణ విద్యుత్ సహకార సంఘం ఎన్నికలు 27తేది జరపనున్నట్లు జిల్లా సహకార శాఖాధికారి పి. రవిప్రకాష్ చెప్పారు. సంఘంలో 23609 మంది సభ్యులున్నారని, అధ్యక్షునితో పాటు 7మంది పాలక వర్గ సభ్యులను ఎన్నుకొంటారని వివరించారు. ఈ సంఘం పరిధిలోని అన్ని గ్రామాలను 7నియోజక వర్గాలుగా విభజించి ఒక్కొక్క నియోజకవర్గం నుండి ఒక్కొక్క డైరెక్టరును ఎన్నుకొంటారట. సంఘ అధ్యక్షుని మాత్రం ప్రత్యక్ష పద్ధతిలో అన్ని నియోజకవర్గ సభ్యులు కలసి ఎన్నుకొంటారు. ఈ ఎన్నికలకు 11 తేది నోటిఫికేషన్ జారిచేస్తారు.

## నెల్లూరు వచ్చేవాళ్లు
### విలార్మకుడు

### జనార్దనరెడ్డి

మాజీ ముఖ్యమంత్రి రాష్ట్ర కాంగ్రెస్ నాయకుడు ఎన్. జనార్దనరెడ్డి 9తేదీ ఉదయం వాకాడు వస్తారు. అదేరోజు సాయంత్రం ఇటీవల మరణించిన వెనుక బడిన తరగతుల నాయకుడు, సైదాపురం గ్రామానికి చిరకాల సర్పంచ్ మున్నారు సిద్దయ్య సంతాప సభలో పాల్గొన్నారు. 10తేదీ నెల్లూరులో పార్టీలో సభ్యత్వ విషయమై మాట్లాడి, రాత్రికి వాకాడు వెళ్లారు. 11తేదీ మొత్తంగా వాకాడులోనే వున్నారు. 12 తేదీ వెంకటగిరి పర్యటన.

### అశోక్ సింఘాల్

విశ్వహిందూ పరిషత్ జాతీయ ప్రధాన కార్యదర్శి అశోక్ సింఘాల్ 31తేదీ నెల్లూరు వస్తున్నారు. ఉదయం పార్టీ కార్యకర్తల సమావేశం, సాయంత్రం విఆర్ కళాశాలలో బహిరంగ సభ.

### ట్రైనింగ్‌కు జాయింట్ కలెక్టర్

జిల్లా జాయింట్ కలెక్టర్ డాక్టర్ ఎస్. నాగేశ్వరరావు ప్రత్యేక శిక్షణ కోసం ముస్సోరి వెళ్లారు. అక్టోబర్ 25తేదీ వరకు ఆయన పరోక్ష బాధ్యతలు డి.ఆర్.డి.ఏ ప్రాజెక్ట్ డైరెక్టర్ శ్రీ. విజయానంద్ నిర్వహిస్తారు.

### జవహర్ భారతి కరస్పాండెంట్ రాజీనామా

కావలి జవహర్ భారతి కరస్పాండెంట్ డాక్టర్ బి.వి. సుబ్బరాయుడు తన పదవికి రాజీనామా చేశారు. కాలేజీలో క్రమశిక్షణ నెలకొల్పడానికి తను చేసిన ప్రయత్నం ఫలించడం లేదనే విసుగుతో, యాజమాన్యం తనతో సహకరించడం లేదనే విరక్తితో పదవీ పరిత్యాగం చేశారాయన. లెక్చరర్ల చేత ట్యూషన్లు మాన్పించడానికి ప్రయత్నించడం - ఆయన పట్ల కాలేజీలో అందరి కన్నెర్రకు కారణమైంది. అయ్యవార్లంతా ఒక్కటై ఆయన్ను సతాయించేశారు. డిఆర్ సహజంగానే మౌన సాక్ష్యం నెరపారు. దీనితో సుబ్బరాయుడు గారికి వైరాగ్యం వచ్చేసినట్లుంది. ఫలితం రాజీనామా!

ఇప్పట్లో కాలేజీలు నిర్వహించాలంటే చర్మం చాలా దళసరి చేసుకోవాలి; చెవుల్లో సీసం పోసుకోవాలి. కళ్లముందు జరిగేవి - తనకు కన్పించనట్లు, ప్రక్కకు వెళ్లి పోయేవారు సమర్థ నిర్వాహకులౌతారు. ఆదర్శాలకు పోయి, అన్నీ చక్కదిద్దాలను కొంటే - ఇదిగో, ఇట్లా ఉంటుంది ఫలితం సుబ్బరాయుడు గారి వంటి మేధావిని వదలు కోవడం జవహర్ భారతికే నష్టం.

### కూరగాయల మార్కెట్‌కు మోక్షం!

ఎట్టకేలకు చిన్న బజారులోని ఎసి సుబ్బారెడ్డి కూరగాయల మార్కెట్, మద్రాసు బస్టాండు వద్ద మార్కెటింగ్ శాఖ నిర్మించిన భవనాల్లోనికి తరలిపోతుంది. దీనికి విజయ దశమి ముహూర్తంగా నిర్ణయించారు. 2తేదీ ప్రస్తుత మార్కెట్‌లోని షాపుల యాజమాన్యంతో మంత్రి రమేష్‌రెడ్డి సమావేశమై, వారడిగిన అన్ని కోర్కెలు తీరుస్తానని హామీ ఇచ్చారు. కొత్తగా గదులు నిర్మించమని, ఇంతకు ముందే నిర్ణయించిన బాడుగను పెంచ వద్దని మార్కెట్ నాయకులు కోరారట. ఇంత పెద్ద మార్కెట్ కట్టి ఆ మార్కెట్‌లోని చెత్త వేసేందుకు కొత్త మార్కెట్ యార్డ్‌లో ప్రత్యేక స్థలం లేదట. ఎంత అధ్వాన్నమైన ప్లాన్‌తో నిర్మాణం చేశారనే దానికిదే సాక్ష్యం. పాత మార్కెట్‌లో చెత్తనంతా తెచ్చి రోడ్డులో వేయడం వల్లే చిన్నబజారు చెత్తబజారుగా మారిన సంగతి తెలియందికాదు.

### వర్షం

జిల్లాలోని అన్ని ప్రాంతాల్లో వర్షం పడుతుంది. బంగాళాఖాతంలో పుట్టిన అల్పపీడనమే దీనికి కారణమని వాతావరణ శాఖ చెబుతుంది. కడప జిల్లాలో కూడా వర్షాలు పడుతుండడం వల్ల పెన్నానది లోతట్టు ప్రాంతాల్లోని ప్రజలు అరచేతిలో ప్రాణాలు పెట్టుకొని ఉన్నారు.

### టీచర్ల నియామకం కోసం జి.ప వద్ద ధర్నా!

ఇటీవల జరిగిన టీచర్ల నియామకపు పరీక్షల్లో ఉత్తీర్ణులైన వారికి ఇంత వరకు నియామకపు ఉత్తర్వులివ్వలేదు. జిల్లా పరిషత్ ఛైర్మన్, సభ్యులు మధ్య రేగిన గొడవ వల్ల, ఎమ్మెల్యేల ఒత్తిడితో సి.ఇ.ఓ ఇంకా ఆ ఫైలును ఛైర్మన్ నాగభూషణమ్మ పంపలేదు. పరీక్షలై, ఫలితాలు ప్రకటించినా నియామక ఉత్తర్వులాని కొత్త ఉపాధ్యాయులు మరో గత్యంతరం లేక 7తేదీ జి.ప కార్యాలయం వద్ద ధర్నాకు దిగారు. ఇప్పటికే బజారు కెక్కిన ఈ వివాదం ఉద్యమరూపం ఎక్కడ దాలుస్తుందోనని భయపడ్డారో ఏమో; శిబిరం వద్దకు నాగభూషణమ్మ, సి.ఇ.ఓ బ్రహ్మేంద్రరావు కలసి కట్టుగా వచ్చి 10రోజుల్లో నియామకపు ఉత్తర్వులిస్తామని, నచ్చ చెప్పి పంపారు.

### రాజేశ్వరమ్మ పుష్కర శరన్నవరాత్రోత్సవం

టౌన్‌లో జనాకర్షణలో తలమానికమైన దేవస్థానమైన రాజరాజేశ్వరి అమ్మవారి పుష్కర శరన్నవరాత్రోత్సవాలు 13 తేదీ నుంచి 21తేదీ వరకు జరుగనున్నాయి. 13తేదీ చండీ, 14న భవానీ, 15న గాయత్రీ, 16న అన్నపూర్ణ, 17న ధనలక్ష్మి, 18న సరస్వతి, 19న కాళికా, 20తేదీ దుర్గా, మహిషాసురమర్దిని, 21తేదీ రాజరాజేశ్వరి అలంకారాలు చేస్తారు. విద్యుద్దీపాలంకరణలో చూపరుల కళ్లు బైర్లు క్రమ్మేట్లు, పుష్పాలంకరణలో కళ్లు చెదిరేట్లు భారీగా ఏర్పాట్లు జరుగు తున్నాయి. ప్రతిరోజా రాత్రి 7గంటల నుంచి మంచి సాంస్కృతిక కార్యక్రమా లున్నాయి. భక్తులను సాదరంగా ఆహ్వానిస్తున్నారు దేవస్థానం ఛైర్మన్ కోడూరు వెంకట రాఘవరెడ్డి.

### జెరాక్స్ షాపుల యజమానుల సంఘం

జిల్లాలోని జెరాక్స్ షాపుల యజమాను లందరు సెప్టెంబర్ 29తేదీ నెల్లూరులో సమావేశమై ఒక సంఘాన్ని ఏర్పాటు చేసుకొన్నారు. అధ్యక్షునిగా నెల్లూరులో జెరాక్స్ మిషన్ను తొలిసారిగా పెట్టిన డిసి హరిబాబును ఎన్నుకొన్నారు. ఉపాధ్యక్షులుగా హరిశ్చంద్రారెడ్డి, శ్రీహరిబాబు, కార్యదర్శిగా ఎస్. శేషాచలం, సహకార్యదర్శిగా రంగారావు, కోశాధికారిగా డి. ప్రభాకర రావులు ఎన్నికయ్యారు. జెరాక్స్ వ్యాపారంలో కష్టనష్టాలను రామన్స్ జాబింగ్ సెంటర్ అధినేత వెంకట్రామన్ సభలో వెల్లడించి; సంఘ సభ్యులంతా ఐక్యతగా ఉండాలని కోరారు. జెరాక్స్ సెంటర్ల నిర్వహణ ఖర్చులు పెరిగాయి కాబట్టి కాపీల రేట్లు పెంచాలని కలసికట్టుగా నిర్ణయించారు.

### వట్టిమాటలతో డీలర్లకు గట్టిమేలు

రేషన్ షాపుల ద్వారా పంపిణీ చేసేందుకు సెప్టెంబరు నెల కోటాగా 4లక్షల 44వేల కేజీల పామోలిన్ను విడుదల చేస్తున్నట్లు ఆ నెల చివరి వారంలో జాయింట్ కలెక్టర్ డాక్టర్ ఎస్. నాగేశ్వర రావు ప్రకటించారు. కాని స్టాక్ పాయింట్‌లో సరకు లేదని ఆ కోటాను డీలర్లు అక్టోబరులో మొదటి వారం దాటి పోయినా ఇవ్వలేదు. జెసి ట్రైనింగ్‌కు వెళ్లడంతో ఆ బాధ్యతలు స్వీకరించిన డిఆర్‌డిఏ ప్రాజెక్ట్ డైరక్టర్ విజయానంద్ అక్టోబర్ నెల కోటాగా 561 మెట్రిక్ టన్నుల పామోలిన్ మళ్లీ విడుదల చేసినట్లు చెప్పారు. కాని పోయిన నెల కోటా ఈ నెల కోటాతో కలిపి పచ్చ, తెల్ల కార్డులకు 3కిలోలు, గులాబి రంగు కార్డుల వారికి 4కిలోలు పామోలిన్ ఇవ్వాలని ప్రకటించ లేదాయన. పోయిన నెల కోటాను జిల్లా పౌర సరఫరా శాఖ, డీలర్లు కలసి స్వాహా చేసేందుకు అవకాశాలు ఎక్కువగా ఉన్నాయి. కలెక్టర్ గారు ఒకసారి ప్రజా పంపిణీ వ్యవస్థను సమీక్షించండి.

### పిన్‌కోడ్ వేయండి!

జిల్లాలో చాలా మంది ఉత్తరాలపై పిన్‌కోడ్ వేయక పోవడం

రవ 7 పేజీలో

## జిల్లావార్తలు

5 పేజీ తరువాయి

తన ఛాంబరులో ఏర్పాటుచేసిన విలేకరుల సమావేశంలో మాట్లాడుతూ ప్రతి రెండు నెలలకు లోక్‌అదాలత్ నిర్వహిస్తామని రాజీతోగాని, అనుమతితో రాజీపడే 320, 323, 325, 337, 338, 508, 516సెక్షన్ల క్రిందవచ్చే కేసులను లోక్ అదాలత్ ద్వారా రాజీ చేస్తామన్నారు. అదే విధంగా వివాహ సంబంధమైన కేసులు, ప్రామిసరీ నోట్లు, యితర ఆర్థికమైన బ్యాంకు లిటిగేషను కేసులను కూడా ఈ లోక్ అదాలత్ ద్వారా పరిష్కరించ వచ్చుని వివరించారు.

చదువుకున్న వారు, రాజకీయ నాయకులు సైతం తెల్లకాగితాలపై సంతకాలు పెట్టడం, వ్రాసినదానిని చదవకుండానే సంతకాలు పెట్టడం వంటివి చేస్తారని, కోర్టులో యిలా ఎందుకు చేశారని అడిగినపుడు పోలీసులు పెట్టమన్నారు, కాబట్టి పెట్టామని చెప్తారని, ఈ పద్ధతి మారాలని జడ్జి కోరారు.

జిల్లా అదనపు జడ్జి టి. చంద్రకుమార్ మాట్లాడుతూ యింతకు ముందు లోక్ అదాలత్ పరిష్కరించిన కేసులు ఇతర కోర్టుల ఆమోదం పొందవల్సి వుండేదని, యిపుడు అవిధంగా గాక యితర సివిల్ కోర్టులవలె అన్ని అధికారాలు కల్గి వుంటున్నారు. వివిధకారాన్ని జట్టి అదనపు బెంచీలను కూడా ఏర్పాటు చేసి అవకాశం కల్పిస్తున్నందున కక్షిదారులు నేరుగా లోక్‌అదాలత్‌కు రావచ్చుని "సహజసిద్ధ న్యాయమే" లోక్ అదాలత్‌కు మూల సూత్రం అని ఆయన చెప్పారు.

కావలి డి.ఎస్.పి. జి.రవీంద్రరెడ్డి మాట్లాడుతూ ప్రమాదాల కేసులలో రాజీ చేసుకుంటే ఎల్.ఐ.సి రాదని, నష్టపరిహారం యివ్వరు అన్న అపోహ వుందని అది తప్పని లోక్ అదాలత్‌లో రాజీ చేసుకున్నా నష్టపరిహారం లభిస్తుందని పేర్కొన్నారు.

పిటి వక్కలతో తయారౌతున్న
మా విజయ వక్కపొడి
25పైసల పొట్లాలు
రుచి గమనించండి.
విజయ వక్కపొడి
ట్రంకు రోడ్డు, నెల్లూరు
ఫోన్ నెం.23372

### భర్తపై భార్య హత్యాయత్నం!

భార్యలను కడతేర్చే భర్తల గూర్చి మనం రోజూ పత్రికల్లో చదువుతుంటాం. కాని వేద మంత్రాల సాక్షిగా తలవంచి తాళి కట్టించుకొన్న ఓ యువతి, కట్టుకొన్నవాడిని అంత మొందించాలని ప్రయత్నించి విఫలం కావడం అనంతసాగరం మండలం పాతదేవరాయ పల్లి గ్రామంలో జరిగింది. గ్రామనివాసి చిట్టేటి అంకయ్య హసనాపురానికి చెందిన తన మేనత్త కుమార్తె సీతమ్మతో నెల క్రితం వివాహమయ్యింది. వివాహ మయ్యింది మొదలు భార్యా, భర్తలు దూరంగా మసలు కొంటుండే వారు. సెప్టెంబరు 27తేది అంకయ్య నిద్రిస్తున్న సమయంలో మచ్చు కత్తితో మెడ నరక బోయింది సీతమ్మ. అలికిడికి ప్రక్కకు తిరిగిన అంకయ్య దవడపై మచ్చుకత్తి వేటుపడి తీవ్ర రక్త స్రావమయ్యింది. తన భార్య ఈ దారుణానికి పాల్పడిన విషయాన్ని ఆలస్యంగా స్పృహలోకి వచ్చిన అంకయ్య బయటకు వెల్లడించారు. సీతమ్మ అంతదారుణానికి ఎందుకు పాల్పడిందో?

### లక్ష్మిపార్వతి గుంటూరు వెళ్లటం ఖాయం: ప్రసన్న

ప్రస్తుతం జరుగుతున్న ఉపఎన్నికల్లో ఎన్టీఆర్ తెలుగుదేశం పార్టీ అడ్రస్ లేకుండా పోతుందని కోవూరు శాసన సభ్యుడు నల్లపురెడ్డి ప్రసన్నకుమార్ రెడ్డి జోస్యం చెప్పారు. 6తేది సంగం మండలంలో పర్యటిస్తూ విలేకరులతో మాట్లాడారాయన. ప్రస్తుత పార్టీ అధ్యక్షురాలు లక్ష్మి పార్వతి ఎన్నికల తరువాత తట్టా, బుట్టా సర్దుకొని గుంటూరు వెళ్లడం ఖాయ మన్నారాయన. పార్టీలో తనకప్పుడాటును కుటుంబ సమస్యగా పేర్కొన్నారు. తాను సైకిల్ గుర్తుపై గెలిచిన విషయం గుర్తుకు తెచ్చు కొన్నారాయన. జిల్లా మంత్రులతో సమస్యలు లేవని, కోవూరు రెండు వర్గాలుగా విడిపోయిన కార్యకర్తలను ఒకతాటిపై తెస్తానని కూడా ప్రసన్న చెప్పారు. రాజకీయ నాయకుల నాలుకలకు నరాలుండవని పెద్దలు ఎప్పుడో సెలవిచ్చారు. ఒకప్పుడు లక్ష్మిపార్వతిని ప్రసన్నలా నాయకుడు కీర్తించిన మరో జిల్లాలో కాదు కదా; రాష్ట్రంలో కూడా ఎవరుండరు. ప్రస్తుతం ఆయనే లక్ష్మిపార్వతిని నానా మాటలంటున్నారు. అంతా పవర్ మహిమ!

### ప్రపంచ వృద్ధుల దినోత్సవం

నెల్లూరు భక్తవత్సల నగర్‌లోని సీనియర్ సిటిజన్ కౌన్సిల్‌లో అక్టోబర్ 1 తేది ప్రపంచ వృద్ధుల దినోత్సవం జరిగింది. వృద్ధులకు ఇంటా, బయటా సరైన ఆదరణ కలిగించే ఉద్దేశ్యంతో పి.ఎస్. రామానుజా చార్యులు ఈ కౌన్సిల్‌ను ఏర్పాటు చేసారు. ఈ సందర్భంగా ఏర్పాటైన సభకు ఆంధ్రా బ్యాంక్ అసిస్టెంట్ జనరల్ మేనేజర్ జి. శంకర రావు గుప్తా ముఖ్య అతిథిగా విచ్చేశారు. దర్గామిట్ట ఆంధ్రా బ్యాంకు మేనేజరు వెంకయ్య, భక్తవత్సల నగర్ షిర్డిసాయి మందిరం అధ్యక్షుడు కె. వెంకట స్వామి నాయుడు వేదిక నలంకరించారు. కౌన్సిల్ అధ్యక్షుడు సి. వెంకట సుబ్బయ్య సభను ప్రారంభించారు. ఎన్.వి. కేశవ రావు, బి. స్వామిదాసు వృద్ధులు పొందుతున్న అనాదరణను, దాని నివారణలను గూర్చి మాట్లాడారు. టి. పార్థసారధి, మహమ్మద్ మజ్హరుల్లా, కె. విశ్వజ్ఞానాచారి, సి. కృష్ణా రావు, శ్రీమతి శేషమ్మ, పద్మావతమ్మలను సన్మానించి ఊతగా ఉండేందుకు స్టిక్‌లు బహూకరించారు. వృద్ధుల ఉత్సాహంతో సభ కళకళ లాడింది. ఈ సందర్భంగా కె. విశ్వజ్ఞానాచారి వృద్ధుల సమస్యలను తెలియజేస్తున్నారు. తనకు బ్యాంకు నిర్వహణలో అనుభవం ఉందని, ఇతరులపై ఆధారపడ వల్సిన అవసరం లేదని ఆయన వివరణ

### కావలి సొసైటీ అధ్యక్షుని వివరణ

కావలి ప్రాథమిక వ్యవసాయ సహకార పరపతి సంఘంలో బయట వ్యక్తుల ప్రమేయం అక్రమాలు ఎక్కువయ్యాయని ఆగస్టు 30తేది 'జమీన్‌రైతు'లో ప్రచురితమైన వార్తపై సొసైటీ అధ్యక్షుడు కొండూరు మునెయ్య వివరణ పంపారు. బ్యాంకు మిద్దెపై గదుల నిర్మాణాన్ని సెంట్రల్ బ్యాంక్ ఛైర్మన్, జనరల్ మేనేజర్, డిప్యూటీ రిజిస్ట్రార్‌కు వ్రాత పూర్వకంగా తెలియజేసి మొదలు పెట్టారట. పొదుపు పథకానికి పై అధికారుల అనుమతి తీసుకొన్నా మంటున్నారాయన. డైలీ డిపాజిట్ ద్వారా ఇప్పటి వరకు 56వేలి వసూలయ్యిందట. ఈ విషయాన్ని సంస్థ ఆడిట్ పుస్తకాల్లో కూడా నమోదు చేసి ఉన్నట్లు అధ్యక్షులు మునెయ్య

### నెల్లూరు ముచ్చట్లు

6 వ పేజీ తరువాయి

వల్ల ఆ పుత్రరం చేరక పోవడమో లేక ఆలస్యం కావడమో జరుగుతుంది, అందువల్ల అచ్చితంగా పిన్‌కోడ్ వేయమని జిల్లా పోస్టల్ సూపరింటెండెంట్ గారు కోరుతున్నారు.

నెల్లూరు 3వ అదనపు మున్సిఫ్ వారికోర్టులో
E.P. 236/95
O.S. 282/94
కెనరా బ్యాంకు, నెల్లూరు.
.. D.Hr/వాది
1. K.సుధీర్‌కుమార్‌రెడ్డి వగైరా
.. J.Drs/ప్రతివాదులు

**నోటీసు**

To 1.శ్రీ కుందా సుధీర్‌కుమార్‌రెడ్డి, S/o. పట్టాభిరామిరెడ్డి, పాతవెల్లంటి గ్రామం, నెల్లూరు రూరల్ మండలం, నెల్లూరు జిల్లా.
2.శ్రీ కుందా బలరామిరెడ్డి S/o. సుబ్బారెడ్డి, పాతవెల్లంటి గ్రామం, నెల్లూరు రూరల్ మండలం, నెల్లూరు జిల్లా అనువారలకు,

పై నెంబరు దావాలో వాది మీఅరువురిపై దావావేసి డిక్రి పొందియున్నారు. పై నెంబరు E.Pలో మీకు నోటీసు నిమిత్తము తేది 29-10-96కి వాయిదా వేసి యున్నది. కావున మీకు గల ఆక్షేపణలు వాయిదా రోజు ఉదయం 10-30గంటలకు పై కోర్టువారి ఎదుట మీరుగాని, మీ తర్పున అడ్వకేటు ద్వారా కాని హాజరయి తెలుపుకోనేది. లేని యెడల మీ పరోక్షమున కేసు విచారించి తీర్మానించబడును.

**P. శేషాచలం** B.A.,BL.
DHR అడ్వకేటు

శ్రీ తల్పగిరి రంగనాథస్వామి వారి దేవస్థానం — నెల్లూరు

## టెండరు ప్రకటన

ఈ దిగువ కనపరిచిన పనికి అనుభవము కలిగిన రిజిష్టర్డు కాంట్రాక్టర్ల నుండి నిర్ణీత ఫారములో టెండర్లు కోరబడుచున్నవి.

| వ.నెం. | పని వివరము | ఎస్టిమేటు విలువ | టెండరు ధరావత్తు | పనిపూర్తి చేయవలసిన కాలపరిమితి | టెండరు షెడ్యూలు ఖరీదు |
|---|---|---|---|---|---|
| 1. | దేవస్థానం స్ట్రాంగ్ రూమ్ పునః నిర్మాణం | 15000 | 375 | 2 నెలలు | 50 |

**షరతులు :**

1. టెండరు షెడ్యూలు 15.10.96 తేది నుండి 18.10.96 తేది వరకు దేవస్థానం కార్యనిర్వహణాధికారికి తగు మొత్తము చెల్లించి పొందవచ్చును.
2. పూర్తిచేసిన టెండరు ఫారములను 25.10.96 తేది మధ్యాహ్నం 12 గంటలకు దేవస్థానం కార్యనిర్వహణాధికారికి చేర్చవలయును. అదే రోజు సాయంత్రం 4 గంటలకు హాజరు అయిన టెండరుదారుల సమక్షములో దేవస్థానం కార్యాలయంలో టెండర్లు తెరువబడును.
3. టెండరు ధరావత్తు దేవస్థానం కార్యాలయమునకు చెల్లించి, సదరు రశీదును కానీ, ఆ మొత్తమునకు DDని గాని టెండరుకు జతపరచ వలెను.
4. ఏ కారణము చూపకుండా టెండరు తొలగించుటకు దేవస్థానం అధికారులకు పూర్తి హక్కు కలదు.
5. మిగిలిన వివరములు పై దేవస్థానము నందు తెలుసుకొన వచ్చును.

గుమ్మనేని ప్రభాకర్, కార్యనిర్వహణాధికారి




జెరాక్స్ అసోసియేషన్ సమావేశంలో ప్రసంగిస్తున్న రామస్ జాబింగ్ సెంటర్ అధినేత ఎం.వి. రామస్. చిత్రంలో డి.సి. హరిబాబు, ఎస్. శేషాచలం, హరిశ్చంద్రా రెడ్డి, దామోదరం.

## నాగార్జున జియో

రెండవ పేజీ కొరవ

నాగార్జున జియో ఇండస్ట్రీస్ లిమిటెడ్ 1995-96లో 22 కోట్ల అమ్మకాలను సాధించి 49 లక్షల రూపాయల నికర ఆదాయం ప్రకటించిందట. నాగార్జున జియో మెరైన్స్ లిమిటెడ్ 92లో కోటి రూపాయల మూలధనంతో ప్రారంభించి మొదటి సంవత్సరంలోనే 40 లక్షల నికర ఆదాయం సాధించి దంటున్నారు. 1994లో 2.70 కోట్ల రూపాయల పబ్లిక్ ఇష్యూ ద్వారా సేకరించారట. ఆక్వా కల్చర్‌లో నష్టాలు వస్తుండగా ఆహార ధాన్యాల ఎగుమతి, స్టార్ హోటళ్ల నిర్మాణంలో సంస్థ అడుగు పెట్టిం దంటున్నారు. రావు అగ్రో ఫామ్స్ ఫార్మసూటికల్ రంగంలో ప్రవేశించ డానికి నెల్లూరులో ఫ్యాక్టరీ కట్టడానికి 215 ఎకరాల స్థలం కొన్నారట. అది ఎక్కడ కొన్నారో, ఏమిటో దానికి వివరాలు చెప్పలేదు వాళ్లు!

వారి ప్రకటన ప్రకారం – వారి గ్రూప్‌లో నాగార్జున జియో ఇండస్ట్రీస్, నాగార్జున మెరైన్స్ లిమిటెడ్, నాగార్జున నేబర్ బేస్, మెగాసిటీ సెక్యూరిటీస్, నాగార్జున బెనిఫిట్ ఫండ్ లిమిటెడ్, రావ్ అగ్రో ఫామ్స్, రావూస్ ఇన్వెస్ట్‌మెంట్ సంస్థలు కేవలం ఫైనాన్స్ కంపెనీలు. వీటి పేరుతోనే వారు డిపాజిట్లు సేకరిస్తున్నారు. కాని, ఆ నిధులతో వారు తిరిగి ఎవరికీ అప్పు లిస్తున్న దాఖలాలు లేవు. కేవలం డిపాజిట్ల సేకరణ వారి వుద్దేశ్యం కాకుంటే, ఒకే గ్రూప్ యాజమాన్యంలో ఒకే వ్యాపకం కోసం ఇన్ని సంస్థలు నిర్వహించ వలసిన అవసరం ఏమిటి?

వీరి విషయంలో సందేహానికి ప్రధాన కారణం – వీరు చూపిస్తున్న వడ్డీ ఆశలు. రూ.300లు కడితే - 21 ఏళ్లలో 25 వేలు ఇస్తామంటున్నారు వీరు. అంటే సరాసరిన 300 రూపాయలకు ఏడాదికి రూ.1176 రూపాయల వడ్డీ అన్నమాట. మానవ మాత్రులకు సాధ్యమయ్యే పనేనా ఇది? తిరిగి చెల్లించే ఆలోచన వుండి చెప్పే మాటలేనా ఇవి? తొమ్మిదేళ్లలో తొమ్మిది రెట్లు తిరిగి ఇస్తామన్నది మరొక పథకం. ఇదీ ఆచరణ సాధ్యం కాని విషయమే!

దేశ వ్యాప్తంగా తమకు వ్యాపారాలు, 8 శాఖలు వున్నట్లు వీరు ప్రకటిస్తున్నారు. కాని, కావలి, నెల్లూరు, గూడూరు, తిరుపతిలో డిపాజిట్లు దండే బ్రాంచీలు తప్ప ఇతర ఏ వ్యాపార వివరాలూ స్పష్టంగా చెప్పడం లేదు. ఈ సంస్థ యజమాని ఎస్. నాగార్జున రావు ఇక్కడ వుండడు. మద్రాస్‌లో కాపురం ఈయన 'ఈనాడు' మార్కెటింగ్ సంస్థలో మాజీ ఉద్యోగి. సంస్థ సేకరించిన, అభివృద్ధి చేసిన ఆస్తులు, పెట్టుబడి వివరాలు వెల్లడించనూ వీరు ముందుకు రావడం లేదు. అక్టోబర్ 2 తేది నాగార్జున రావు నెల్లూరులో ప్రెస్‌మీట్ పెట్టి ఇచ్చిన సంస్థ కార్యకలాపాల వివరణ పత్రంలో ఎవరి సంతకమూ లేదు ఏ రూపంలో చూసినా ఈ సంస్థ కార్యకలాపాల పట్ల స్పష్టమైన అవగాహన కల్పించ లేదు. పేరు, ప్రతిష్ఠ స్వంత ఆఫీసు, ఆస్తులు, యజమానుల వివరాలు తెలిసిన దేవీ గోల్డ్, టీఎన్ఎస్ వివి. స్నేహ ఫైనాన్స్ వంటి సంస్థలే ప్రజలకు టోపీ పెట్టి, కోట్లు దోచుకున్నాయి. చిరునామా కూడా లేని ఇటువంటి సంస్థల విషయంలో ప్రజలు జాగ్రత్త పడాలని హెచ్చరించడం అవసరమే కదా?



## మద్యం

మొదటి పేజీ కొరవ

సర్వీసు వదలి, ప్రజలలోకి వస్తున్న ఐఎఎస్ అధికారి జయప్రకాష్ నారాయణను ఈ రహస్య పథకం ఆచరణకు సారథిగా నియమించారని వినికిడి. మద్య నిషేధం విఫలమైందని, దాని వల్ల ప్రజలు ఇబ్బంది పడుతున్నారని ఆయన చేత చర్చ ప్రారంభింప జేసి, మెల్ల మెల్లగా ప్రజాభిప్రాయం బలపరచి, మద్య నిషేధం సడలింప చేయాలన్నది రామోజీ రావు ఆలోచన. జయప్రకాశ్ నారాయణ్ అప్పటికే ఒక అడుగు ముందుకు వేసి తన సన్నిహితులతో, కొందరు రాజకీయ వాదులతో ఈ విషయం ప్రస్తావించారు. వీరందరి చేత చంద్ర బాబుకు టెలిఫోన్ వర్తమానాలు పంపడం పథకంలో ఒక భాగం. ఈ మద్య నిషేధం రద్దు చర్చకు ఈనాడు దినపత్రిక, ఈటివిలలో విస్తృత ప్రచారం లభించ 'న్నది. ఈ సాహసోపేత నిర్ణయం తీసుకోకుంటే తన జీవిత కాలపు ఆర్జన, జీవన ధ్యేయమైన స్టూడియోలో ఈగలు తోలే పరిస్థితి ఏర్పడు తుందని రామోజీ రావు గారి భయం. వారి పథకం ఎంతవరకు ఫలిస్తుందో వేచి చూడవలసిందే; అప్పుడే చెప్పలేము.

## వెయ్యికోట్లు

మొదటి పేజీ కొరవ

కోట్ల రూపాయలు దుబారా అయిపోయాయని అంచనా, అంటే ఈ స్కాం – యూరియా స్కాం కంటే ఏడెనిమిది రెట్లు పెద్దదన్న మాట. బీహార్ గడ్డి కుంభకోణం కంటె కూడా ఇదే పెద్దది. ప్రజల సొమ్మును ఇంత నిర్లజ్జగా, విశృంఖలంగా పాడు చేసిన సంబంధిత అధికారులపై దర్యాప్తు జరిపి, చర్యకు ఆదేశించమని కోరుతూ ఒక స్వచ్ఛంద సంస్థ న్యాయ స్థానాలను ఆశ్రయించ బోతున్నది.

ఇప్పటి వరకు అవినీతి కేసుల సంచలనం ఢిల్లీకి మాత్రమే పరిమితమై వుండింది; అదిప్పుడు రాష్ట్రాలకు ప్రాకుతున్నది. ఎవరైనా పూనుకొని పరిశోధన చేయాలే కాని, ఆంధ్ర ప్రదేశ్‌లో ఇటువంటి స్కాంలు ప్రతి ఫైలులోనూ కన్పిస్తాయి.

## పంచాంగమ్

తేది 13 ఆదివారము దేవీ నవరాత్రి ఉత్సవ ప్రారంభము

అక్టోబరు తిథులు

ఆశ్వయుజ శుద్ధ

| | | |
|---|---|---|
| తే 13 ఆది | పాడ్యమి | రా.గ. 7.24 వ |
| తే 14 సోమ | విదియ | రా.గ. 9.06 వ |
| తే 15 మంగళ | తదియ | రా.గ. 6.10 వ |
| తే 16 బుధ | చతుర్థి | సా.గ. 5.52 వ |
| తే 17 గురు | పంచమి | సా.గ. 3.50 వ |
| తే 19 శుక్ర | షష్ఠి | ప.గ. 2.00 వ |

స్వయంపాకుల శ్రీనివాసులు, ఎం.ఎ.

## మాటలతో ఆట - 25

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | 1 | | | 2 | | | 3 | | | 4 | |
| 5 | | | 6 | | | 7 | | | 8 | | |
| | | 9 | | | 10 | | | 11 | | | 12 |
| | 13 | | | 14 | | | 15 | | | 16 | |
| 17 | | | 18 | | | 19 | | | 20 | | |
| | | 21 | | | 22 | | | 23 | | | 24 |
| | 25 | | | 26 | | | 27 | | | 28 | |
| 29 | | | 30 | | | 31 | | | 32 | | |
| | | 33 | | | 34 | | | 35 | | | |
| | 36 | | | 37 | | | 38 | | | | |
| 39 | | | 40 | | | 41 | | | | | 42 |
| | | 43 | | | 44 | | | | 45 | | |

### అడ్డం:

1. ముర్గ మంద (2)
2. స్నాతకోత్సవంలో స్నానమాడిన స్త్రీ (2)
3. గర్వం (2)
4. పెంపెక్కులో అధికం (2)
5. వేద్యం వంతర్ (2)
6. గొప్పది (2)
7. వికతం; క తీసేయ్; పోయినది (2)
8. కారే లాలాజలం (2)
9. గీసిన చిత్రం; పట్నంను మార్చు (2)
10. మారేడులో రాజా (2)
11. పాకిస్తాను వేర్పాటుకు కారకుడు (2)
12. పారాయి (2)
14. అగ్ని పర్వతంలోంచి వెల్లువెత్తే ద్రవం (2)
15. అవ్వకాదు; మెచ్చుకోలుగా అనేమాట (2)
16. పాఠాలు కరుక్కొనే దానికి ఇచ్చేవాళ్లు (2)
17. టిబిలు (2)
18 అభినయించే స్త్రీ 920
19. తుమ్మెదలు చేసే శబ్దం (2)
20. వేలు కాదు; పరిపాలించు (2)
21. సహాయం; -నీర (2)
22. హిందీలో సోదరుడు;పర్యాలాగ (2)
23. రోడ్డు మీదవేసే నల్లని ద్రవం (2)
25. 7రోజులు (2)
26. శిరస్సు; చంద్ర - (2)
27. ధరకాదు; పైనుండి పడేనీటి ధారలు (2)
28. తిరిగొంతలో సమయం (2)
29. ఉపవాసం (2)
30. దీపనంలో దయనీయం (2)
31. పేరు (2)
32. అరుల్లో ఒక నక్షత్రం; కవి కూడ (3)
33. కోపం కాదు అందం (2)
34. సవ్వడిలో అక్షరం లాగేసినా అదే అర్థం (2)
35. చేతికి ధరించే మురుగు (4)
36. ఇంగ్లీషులో బయటద్వారం (2)
37. క్రమం మార్చు కరువు (2)
38. సన్న బియ్యపు ముక్క (2)
39. దినపత్రం (2)
40. అన్నం పెట్టే ఇల్లు (2)
41. వెలుగులేని ఇల్లు (4)
43. పద్మలా పలికే ఎల్ల (2)
44. వారువలులో వరుసలు (3)
45. పైనదవిలో, రాజకీయ బ్రోకర్లు చేసేపని (3)

### నిలువ:

1. తొర; ఆ దూర-తలేరు; మెదకొక రేలు (2)
2. జలక మారటం (2)
3. చూతము దండి మామిడి చెట్టును (2)
4. చెల్లెలా పలికేది; అధికం అని అర్థం (2)
5. అతిథులకు పెట్టే ఇంపైన భోజనం (2)
6. వటం కాదంది; కుండ (2)
7. పట్నం లేదా ఊరు (2)
8. ఒక రకం మెట్టపైరు (2)
9. యతి గణ ప్రాసలతో రాసే కవిత (2)
10. దేవదు కొనవరికితే నిలిచుండు చెట్టు (2)
11. నాలుక (2)
12. వ్యవసాయం (2)
13. ఖషీ (2)
14. పోలీసు చేతిలో ఉండేకర్ర (2)
15. సంస్కృతంలో పలుకు అని అర్థం; సత్యం - ధర్మం చర(2)
16. భాగం (2)
17. శరీరం (2)
18. వరవంతి (2)
19. ...లేదా బారెడు హాసం (2)
20. నది (2)
21. తోరణంలో ణ తీస్తే అధికం (2)
22. మెచ్చుకోలు మాట భ తోటి మొదలు (2)
23. చంద్రుడి భార్య(2)
24. బీదరికం దతో మొదలు (4)
25. గృహనిర్మాణ శాస్త్రం (2)
26. ఉలుకు పలుకు లేకుండ ఉండటం (2)
27. పరంధామంలో నివాసం (2)
28. రుణముకు ముందు అక్షరం చేరిస్తే సమయమే (4)
29. కోరె (2)
30. ఇంటికి - అల్లాలు (2)
31. డాక్టరు దివ్వపట్టి చూసిరోగాన్ని నిర్ణయిస్తారు (2)
32. అకలి కొన వరుస; అర్థగింత (2)
33. ఇంగ్లీషులో మార్గం (2)
34. సమానం (2)
35. కంకవటిలో వ తీస్తే మంచం (3)
36. వగరా (2)
37. క్షత్రియుల గుణం (2)
38. బియ్యపు ముక్కలు (3)
39. స్నేహం; ఊర్మిలా పలికేది (2)
40. పద్మలా పలికేది కట్టు అని అర్థం (2)
41. చిప్పడు లోంచి అక్షరం లాగితే పిలుచు అవిఅర్థం (2)
42. వావిలో రుచి (2)

## మాటలతో ఆట - 23 సమాధానాలు

అడ్డం: 1.కోర 2.అర్థం 3.కోల 4.జాజి 5.వాలి 6.తెలి 7.గాడు 8.వలి 9.తూలు 10.తేఈ 11.దాన 13.కాలు 14.సారం 15.వంతు 16.తూము 17.చెటు 18.కూన 19.కొంగ 20.ధర 21.గాపం 22.పిచం 23.వనం 25.తవిరి 27.కాను 28.దూల 29.పాట 30.మకర 32.గని 34.జలం 36.వేల 37.కృష్ణ 38.బుచ్చు 40.కవచం 43. మరువు 44.బాణం 45.రుద్రాక్షమాల 48.చెవు 49.దాన 50.రంభ 51.దియి

నిలువు: 1.గోత 2.అలి 3.కోరు 4.జాలి 6.తెలు 7.గాకి 8.వస 9.తూట 10.కరం 11.దాతు 12.పాము 13.కాటు 14.సాన 15.వంగ 16.తూర 17. చేమంతి 18.కూసం 19.కొంచెం 20.ధనం 21.గారి 22.పిమగ 23.వలజ 24.వాణి 26.వితుల 31.రక్క 33. నిలువు 35.లంకణం 36.వేమారు 38.జమల 41.చందనం 42.క్ష 44.బాపురి 46.ద్రాక్ష 47.మాష

సరైన సమాధానాలు పంపిన వారు: వనపర్తి అచ్యుతేశ్వరరావు, కొరిపత్రి; వి.వి. పద్మకుమారి, హైదరాబాదు; జి. వసుధ, తిరుపతి; యం. సుబ్రహ్మణ్యం రాజా, గూడూరు; ఎస్. సుగుణ, విద్యానగర్; టెనుమల్ల సుశీత, నెల్లూరు; తవిసెట్టి వెంకటరమణయ్య, మాచర్లవారిపాళెం; పాటెపిర శేఖరాచారి, నెల్లూరు; గ్రంధి అచ్యుతపల్లి, తెనాలి; విజేత: వనపర్తి అచ్యుతేశ్వరరావు.

# రజనీకాంత్ ఆదర్శ నిర్ణయం

తమిళ హీరో రజనీకాంత్ ఆదర్శప్రాయుడు. తనతో తొలుత చిత్రాలు నిర్మించి, ఇప్పుడు కాస్త వెనుకబడ్డ నిర్మాతలందరూ భాగస్వాములుగా ఒక సంస్థను నెలకొల్పి తీయబోయే చిత్రానికి కాల్‌షీట్లు ఇచ్చారు. రజనీతో చిత్రం నిర్మించడానికి ఎన్నో పెద్ద సంస్థలు సిద్ధంగా ఉండగా ఇలా తన శ్రేయోభిలాషుల చిత్రానికి రజనీ కాల్‌షీట్లు ఇచ్చినందుకు అందరూ హర్షం వెలిబుచ్చుతున్నారు.

### "మాఊరి గంగమ్మ"

"హీరో రాజకుమార్ మా చిత్రంలో నాటకాల ప్రియుడు. దుర్యోధనుడు, వృద్ధుడు, ఇన్‌స్పెక్టర్ గెటప్స్‌లో కనిపిస్తాడు. గంగమ్మగా శ్రీవిద్య నటిస్తుంది," అన్నారు శ్రీకృప

చిత్రంలో రాజకుమార్, సీత, శ్రీవిద్య, ప్రియాంక, డబ్బింగ్ జానకి, దివ్యశ్రీ, సుమశ్రీ, కవిత, కోట శ్రీనివాసరావు, వినోద్, గుండు హనుమంతరావు, రమణమూర్తి, సింధూసాగర్ పాత్రధారులు. కథ, మాటలు: కర్పూరపు ఆంజనేయులు.

### "మా ఆయన బంగారం"

చక్కని చిత్రాలను తీసే ఈశ్వరం ఫిలిమ్స్ వారు తమ తాజా చిత్రానికి చక్కని పేరే పెట్టారు. "మా ఆయన బంగారం" చిత్రంలో డాక్టర్ రాజశేఖర్, సౌందర్య, కస్తూరి, కాశ్మీరా, మురళీ మోహన్, దగ్గుబాటి రాజా, బ్రహ్మానందం, చలపతిరావు, నర్రా, వినోద్, మల్లికార్జునరావు, నిర్మలమ్మ, శివపార్వతి, సుధ పాత్రధారులు. మాటలు: ఎం.వి.ఎస్.హరనాథరావు. సంగీతం: వందేమాతరం శ్రీనివాస్. దర్శకత్వం: ఎ.మోహన్‌గాంధీ.



'జాబిలమ్మ పెళ్ళి' చిత్రంలో వాణిశ్రీ, జగపతిబాబు

# డ్రాయర్లు బ్రాల పేరుతోనూ సినిమాలు?

"అదేం పేరని ఆశ్చర్య పోకండి. ఏ పేరయినా హిట్ చేసి తీరుతాను," అంటారు "భారతీయుడు" చిత్రం ఖ్యాతి డైరెక్టర్ శంకర్. ఈ చిత్రానికి మ్యూజిక్ ఎ.ఆర్.రెహమాన్‌ను అమెరికాకు తీసుకెళ్లారు. అక్కడ్నుంచి తిరిగొస్తూ, ఇటీవల అమెరికాలో హిట్స్ అయిన హాస్య చిత్రాల వీడియో కేసెట్లు తీసుకొచ్చారు. అంచేత, "జీన్స్" చిత్రం హాస్య ప్రధాన చిత్రమనుకోవాలి. తెలుగు, తమిళభాషల్లో తయారయ్యే ఈ చిత్రంలో హీరో ప్రశాంత్ ద్విపాత్రాభినయం ప్రత్యేక ఆకర్షణ. "ఈ చిత్రం హిట్ అయితే శంకర్ తన తదుపరి చిత్రాల పేర్లు "అండర్ వేర్, బ్రా" అనికూడ పెట్టుకోవచ్చు అని ఒకరు కామెంట్ చేశారు.

### "రంగనాయకమ్మ బోర్డింగ్ అండ్ లాడ్జింగ్"

"ఒక లాడ్జింగ్‌లో జరిగే మర్డర్ మిస్టరీ కథను హాస్యభరితంగా చిత్రీకరిస్తున్నాం. ఇందులో నరేష్ కొంతసేపు గుడ్డివాడుగా నటిస్తాడు," అన్నారు గెద్దాడ ఆనందబాబు. ఈయన కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం వహించే ఈ చిత్రంలో నరేష్, లతాశ్రీ, వందన, తనికెళ్ళ భరణి, బాబూమోహన్, మల్లికార్జునరావు, సారథి, చిట్టిబాబు, చలపతిరావు, కాశీ విశ్వనాథ్, అశోక్ కుమార్, కల్యాణీకుమార్, ఐరన్‌లెగ్ శాస్త్రి పాత్రధారులు. సంగీతం: రాజ్.

# తెరపై చల్లిన పూలు తిరిగి తెచ్చుకున్న వీరాభిమానులు

రజనీకాంత్ నటించిన "నాన్ మహాన్ అల్ల" తమిళ చిత్రం చాలా కాలానికి కడలూరులోని "రమేష్ థియేటర్"లో ప్రదర్శింపబడింది. మొదటి రోజు ఉదయం ఆట కేవలం ఆ హీరో అభిమాన సంఘాల వారికే కేటాయించ బడింది. టైటిల్స్ ముగియగానే తొలిషాట్‌లో ఫెల్ట్‌హాట్, నల్లటి పొడుగాటి కోటు తొడుక్కున్న ఒక ఆకారం గబగబ మేడ మెట్లెక్కి వెళ్తోంది. రజనీకాంత్ అభిమానులందరూ ఒక్కసారిగా జయజయ ధ్వానాలు చేస్తూ, తెర మీద పుష్పవర్షం కురిపించారు. కొందరు టెంకాయలు కొట్టారు. మరికొందరు గుమ్మడికాయ మీద కర్పూరం వెలిగించి, దిష్టి తీశారుకూడా. ఇంతలో హఠాత్తుగా ఆ ఆకారం క్లోజప్ వచ్చింది. ముఖం మీద లైట్ పడగానే ఆ ఆకారం విలన్! అభిమానులందరూ కొయ్యబారి పోయారు. తేరుకున్న వెంటనే ఒక్క ఉదటున వెళ్లి, తెర మీద విసిరేసిన పువ్వులంతా ఏరుకొచ్చి, తమ అభిమాన హీరో రజనీ కోసం తెరవంక గుడ్లప్పగించి చూస్తుండి పోయారు!

**దీన్ని అభిమానపు వెర్రి అనాలేమో!**

### కృష్ణ ఎం.ఎల్.ఎ

"ఒక మంచి ఎం.ఎల్.ఎ ఎలా ఉండాలన్నది మా చిత్రం తెలియజేస్తుంది," అన్నారు బోయపాటి కామేశ్వరరావు. ఈయన దర్శకత్వం వహించే "ఎం.ఎల్.ఎ" చిత్రంలో కృష్ణ, సత్యనారాయణ, మురళీమోహన్, గిరిబాబు, కోట శ్రీనివాసరావు, తనికెళ్ళ భరణి, శివాజీరాజా, రాజకుమార్, దువ్వాసి మోహన్‌కుమార్, లక్ష్మి నటవర్గం. రచన: పరుచూరి సోదరులు.

**బ్రాహ్మణ ద్వేషం క్రుమ్మరించి, ప్రేక్షకులపై కులాల విషం చిలకరించిన చవకబారు సినిమా**

# అదిరింది అల్లుడు

**చిత్రసమీక్ష ☆ గ్రిద్దలూరు గోపాలరావు**

కులాంతర వివాహాల మీద, "అదిరింది అల్లుడు" చిత్రం ఇ.వి.వి. సత్యనారాయణ దర్శకత్వంలో రూపొందింది. కులాంతర వివాహాలను ఆక్షేపించటం, వాటిని అడ్డుకోవటం ఈనాడు నేరం. "నువ్వు అన్య కులస్థుడవు, మా అమ్మాయిని పెళ్ళి చేసుకోతగవు"- అని ఒక బ్రాహ్మణ కులస్థుడి చేత అనిపించి రచయిత, దర్శకుడు నేరం చేశారు. సమాజానికి ద్రోహం చేశారు.

ఈ చిత్రంలో అగ్రవర్ణ బ్రాహ్మణ కులాన్ని, అడుగున వున్న కల్లుగీత కులాన్ని ఎన్నుకొని దర్శకుడు కథను నడిపించారు. బ్రాహ్మణ కులంలో కర్మకత్వాన్ని, మూఢ తత్వాన్ని అధికంగా చూపాడు. తద్దినాలు పెట్టటానికి, పౌరోహితం చెయ్యటానికి, పెళ్ళిళ్ళు జరపటానికి, శాంతి కార్యక్రమాలు నెరపటానికి మాత్రమే బ్రాహ్మణులున్నట్లు చెప్పిస్తాడు. ఆ కులాన్ని దుయ్యబట్టాడు. అదే విధంగా బడుగు వర్గానికి చెందిన కల్లుగీత వారిలో మోసం చూపించాడు. ఉదాత్తంగా ఉండవలసిన కథా నాయకుడి చేత మోసకార్యం సాగిస్తాడు. కథా నాయకుడు బ్రాహ్మణ వేషం ధరించి బ్రాహ్మణ అగ్రహారంలో తిష్టవేసి బ్రాహ్మణుల అమ్మాయిని పెళ్ళి చేసుకుంటాడు. బడుగు వర్గస్తుడు అగ్రవర్ణం మీద మోజు పెంచుకొని, మోసంతో ఆ కులంలోకి ప్రవేశించి వారి సహపంక్తిలో కూర్చోవటం కాదు కావలసింది. తన బలహీన కులాన్ని బలపరచి అగ్ర కులం స్థాయిలో నిలబడటం కావాలి. ఈ చిత్రంలో అది లోపించింది. ఈ విధంగా నిజాయితీగా, న్యాయసమ్మతంగా నడుచుకోవలసిన బడుగు వర్గాన్ని దర్శకుడు అవమానించాడు. అంతే కాకుండా కథా నాయకుడి పాత్రకు కళంకం కూర్చాడు. బ్రాహ్మణ వేషంలో వున్న కథానాయకుడు తనను ప్రేమించిన బ్రాహ్మణ అమ్మాయితో ప్రేమ కలాపాలు జరపటమే గాక, ఆ అమ్మాయి అమ్మతో కూడా సరస సల్లాపాలు సాగించటం నీచం. బ్రాహ్మణ అమ్మాయిని పెళ్ళాడిన కథా నాయకుడి మోసం వెల్లడైన తర్వాత, అమ్మాయి తండ్రి రాక్షస రూపం దాలుస్తాడు. అయినా ఆ అమ్మాయి తండ్రిని ఎదిరించి, కథా నాయకుడు నివసిస్తున్న గూడానికి వస్తుంది. కాని ఆ అమ్మాయిని కథానాయకుడు చేరదీయకుండా, ఆమె తండ్రి మీద కక్ష బూనుతాడు. "నువ్వువచ్చి కోరితేగాని నీ కూతుర్ని చేరదీయనంటాడు"- ఇది ధీరోదాత్త లక్షణంగా లేదు. అమ్మాయి తెగించి వచ్చినప్పుడు ఇక పగబట్టిన తండ్రి మీద సవాలెందుకు? ఇలాంటి అసహజపు విషయాలు హీరోయిజానికి విరుద్ధంగా, హీరో పాత్రను అర్థరహితంగా చిత్రించే ధోరణిలో దొర్లుతాయి. అగ్రహారం లోని బ్రాహ్మణుల నంతా విలన్లుగా చూపడం మరీ ఘోరం!

తమిళ రచయిత, దర్శకుడు

కొరవ 11 పేజీలో

# తల్లిపై మమకారంతో సాంప్రదాయాన్ని ధిక్కరించిన శ్రీదేవి

శ్రీదేవి తల్లి మరణించి నప్పుడు విచారించ డానికి ఇద్దరు, ముగ్గురు నిర్మాతలకు మించి ఎవరూ రాలేదు. కాని, బొంబాయి నుంచి బోనీకపూర్ మాత్రం పెద్ద దండతో విమానంలో వచ్చి శ్రీదేవి తల్లి భౌతిక

**మద్రాసు సినిమా వార్తలు**

కాయానికి అంజలి ఘటించాడు. అప్పుడు శ్రీదేవికి ఉప్పెనలా దుఃఖం ముంచుకొని వచ్చింది. కాని, ఆమె తల్లి శవానికి శ్రీదేవి తల కొరివి పెట్టడం శాస్త్ర సమ్మతం కాదని పలువురు ఆక్షేపణ తెలియజేశారు. "నేడు మహిళలు ముందంజ వేస్తున్నారనడానికి ఇదొక నిదర్శనం," అని శ్లాఘించాయి మద్రాసులోని కొన్ని మహిళా సంఘాలు.

### నమోదు చేయబడిన కొత్త చిత్రాల పేర్లు

జె.ఎస్.ఎస్.ఫిలిమ్స్ "విధి", శ్రీ ప్రసన్నాంజనేయ ప్రొడక్షన్స్ "థిల్లానా", స్వాతి క్రియేషన్స్ "కావేరి", శ్రీ చిత్ర క్రియేషన్స్ "దేవుడు", సాయి కంబైన్స్ "ఆవారాగాడు", ఓం మూవీ మేకర్స్ "ఆరోప్రాణం", వేమసల్ ఆర్ట్ మూవీస్ "అనగనగా ఒక అబ్బాయి", విఘ్నసాయి ఫిలిమ్స్ "అందాలరాశి", సత్య చిత్ర ఎంటర్‌ప్రైజెస్ "అత్తా! నీ కొడుకు

కొరవ 11 పేజీలో

ఇస్కాన్ నిర్వహించిన అంతర్ కళాశాలల వక్తృత్వ పోటీలు ప్రారంభోత్సవం జ్యోతి ప్రజ్వలనం చేస్తున్న సుఖదేవ్ స్వామి. ప్రక్కన పెరుగు రామకృష్ణ.

# రాయి - తురాయి

## * కొసమెరుపు లేకుంటే గొప్ప కథకుల సరసన కొలువుదీర గల్గిన జయంపు కృష్ణ

జనబాహుళ్యం లోనికి బాగా చొచ్చుకొని పోయి, మిక్కిలి ప్రాచుర్యాన్ని పొందిన ప్రక్రియ కథ. దీనికి కారణాలు చాలా ఉన్నాయి.

ఒక్క కవిత్వమే కాదు - సాహిత్య ప్రక్రియ ఏదైనా సరే - ఆలోచనా మృతం; పాఠకుడికి ఆలోచించే పని కల్పించాలి; ఆలోచనా స్థాయిని బట్టి ఆనందా మృతాన్ని ఒక్కొక్క బొట్టుగా ఆస్వాదిస్తాడు చదువరి తన సంస్కారానికి తగ్గట్టుగా.

నేటి కథ దీనికి పూర్తి విరుద్ధంగా నడుస్తుంది. కాల్పనికత హెచ్చు;

**అగ్నిమిత్ర**

శిల్పం లొచ్చు. ఊహా పోహలే ఊపిరిగా, ఉబుసుపోక ఉదంతాలన్నీ కథలుగా రావటం.

రస విషయికంగా శృంగారానికి కామ శాస్త్ర పరంగా పెక్కుకు వున్న అంతరం ఏనుగకు, దోమకు ఉన్నంత. దీన్ని త్రోసి రాజని బూతే రౌతుగా కథలపై సవారీ చెయ్యడం; దానికి పత్రికల తోడ్పాటు, ఇంకా ఎన్నెన్నో...

మొత్తానికి నేటి కథ టోటల్‌గా కమర్షియలైజ్ అయిపోయింది; అంగడి సరుకుగా మారిపోయింది. నీచాభిరుచులను కొందరు రచయితలు పనిగట్టుకొని పోషిస్తున్నారు. అయితే కథలన్నిటిని ఒకేగాట కట్టెయ్య దానికి వీలు లేదు. కావాచిత్కంగానైనా, ఎడారిలో జలాశయంలా మంచి కథలు గూడా వస్తున్నాయి. అయితే గుణాత్మకమైన కథల సంఖ్య చాలా తక్కువే.

వేదుకే ప్రయోజనంగా గల క్లైంపాప్ కథలే రాజ్యమేలు తున్నాయి. దానిలో వుండే బోసితనం సంగతి దేవుడి కెరుక; పొద్దుపోక పరమ ప్రయోజనంగా నేటి కథ ప్రవర్తిల్లు తుంది.

జయంపు కృష్ణ కథలు చాలా వరకు ఈ నలిగిన బాటలో నడిచేవి కావు. వైవిధ్యంతో బాటు కొంత వైశిష్ట్యాన్ని సంతరించుకొని సాగి పోతుంటాయి. కృష్ణ తనకంటూ ఒక శైలిని, శిల్పాన్ని అలవరుచు కొన్నారు. ఎవరినీ అనుకరించరు. స్వీకరించిన వస్తువు ఎంత స్వల్పమై నప్పటికీ, దాన్ని అనల్పమైన కథ సామర్థ్యంతో నిర్వహించడం ఆయన ప్రత్యేకత. సెలయేటి ప్రవాహ సదృశ్యమైన శైలి. చక్కని భాష, సరళ సుందరమైన శిల్పం - ఈ మూడు గుణాలు ముప్పేట హారంగా పొసగి, ముచ్చట గొల్పుతుంటాయి.

కృష్ణ కథలకు చదివించే గుణం పుష్కలంగా ఉంది. మొదలు పెట్టిన క్షణం నుండి కథ పూర్తయ్యే వరకు వదల బుద్ధి కాదు. కృష్ణ కథలలో ఉండే గొప్పతనం ఇదే.

వస్తువు ఎంత గొప్పదైనా చదివించే గుణం లేకపోతే ఏం ప్రయోజనం? కృష్ణ కతలు లోప రాహిత్యాలని దీని తాత్పర్యం కాదు. ఎంత గొప్ప కథలోనైనా లోపాలు వుండక పోవు; ఏ లోపమూ లేని సర్వసమగ్రమైన కళ ప్రపంచంలో అరుదే!

కృష్ణలో ఉన్న లోపం ముఖ్యంగా కొసమెరుపుల కొసవెర్రి. ఈ వెర్రి ప్రమాణం వేపకాయంతే అయినా అది చేస్తున్న హాని చాలా పెద్దదే. కథకు కొసమెరుపు 'హా'కని నా ఉద్దేశ్యం కాదు. దాన్ని ఉపయోగించడంలో కృష్ణ ఉచితానుచిత విచక్షణ చూపటం లేదని నా అభిప్రాయం.

ఈ కొసమెరుపు శిల్పం కొన్ని కథలకు అవసరమే; సామాన్య పాఠకుల్ని తబ్బిబ్బు చేసి ఏమార్చేది ఈ కొసమెరుపే. కాబట్టి సామాన్యంగా ఆషామాషీగా రాసే కథలకు ఈ కొసమెరుపు తప్పదు. కాని గంభీరంగా నడుస్తున్న కథలు కూడా ఈ కొసమెరుపు తురుపు వాడటం వల్ల శిల్పం పలచనై గాంభీర్యం వెలితి పడి వెలవెలా పోతుంది. ఈ విషయంలో కృష్ణ పాఠకులను ఏమార్చాలను కొంటూ, తానే ఏమరుపాటులో పడిపో తున్నాడేమో ననిపిస్తుంది.

"ఈ సమాజం చిగిర్చే దెప్పుడు?" చక్కని కథా వస్తువు; చక్కని కథా శిల్పం; గంభీరమైన సన్నివేశ కల్పనలతో పాఠకుడిలో మంచి ఉత్కంఠను, ఉద్వేగాన్ని కలిగిస్తుంది. చదువరులను ఆలోచింప జేసే కథ. కాని ఏం ప్రయోజనం? కొసమెరుపు వల్ల అంతా తేలిపోతుంది. కథ తాను తెల్లబోవడమే కాదు పాఠకుడిని కూడా వెల్లబోయేటట్లు చేస్తుంది.

మనకు స్వతంత్రం వచ్చి 50 ఏళ్లు గడిచినా, ఫ్యూడల్ వ్యవస్థ అవలక్షణాలు మనల్ని వదలి పెట్టలేదు. ముఖ్యంగా పల్లెల్లోని పెత్తందార్ల బుర్రల్ని దీని అవశేషాలు ఇంకా తొలుస్తూనే ఉన్నాయి. శారద హరిజనుల పిల్ల. విష్ణు బ్రాహ్మణుడు; వివాహం చేసుకొంటారు. విష్ణు కొంటు డిపార్టుమెంటులో హెల్పరుగా ఒక పల్లెటూరులో కాపుర మంటారు. పొట్ట చేత బట్టుకొని వచ్చిన ఈ జంటకి తన ప్రతాపాన్ని చూపిస్తాడు - ఆ ఊరి సర్పంచి. అతని క్రౌర్యానికి శారదా విష్ణులు ఆహుతై పోతారు. సాయి అనే మరొక హరిజన యువకుడు వారికి ఆప్తుడై, మంటలలో చిక్కుకొన్న శారదా విష్ణుల బిడ్డను రక్షిస్తాడు.

మింటి కెగసి పడుతున్న మంటల్ని చూస్తూ నిలబడి పోతాడు. కథకు ఇక్కడ ముగింపు ఇచ్చి వుంటే ఎంతో బాగుండేది. సాయి మాత్రమే కాదు, పాఠకులు కూడా మంటలనేసి చూస్తూ ఆలోచనా మగ్నులై వుండేవారు. కథ గొప్ప కథల సరసన కొలువు దీరి ఉండేది.

కాని సర్పంచి కూతురు జ్యోత్స్న సినిమాటిక్ ప్రేమాయణం -కథను మామూలు స్థాయికి కుదించి వేయడం లేదూ?

"అంధకారం లోంచి అనంతమైన వెలుగులోకి" అని చెప్పించడం కూడా రొమాంటిక్‌గా ఉందే తప్ప వాస్తవానికి చేరువ గాలేదు. ఎక్కడి కెళ్లినా ఈ మనుషులే ఈ మనస్తత్వాలే కదా! కృష్ణ ఆలోచించ గలడను కొంటాను. ఇది విమర్శ కాదు; సూచన మాత్రమే; స్వీకరించినా, నిరాకరించినా కృష్ణాధీనం"

"ముక్కు పుడక" శృంగార రస ప్రధానమైన బంగారం లాంటి కథ. వస్తువు అల్పమైనదే. కాని కృష్ణ అద్భుతమైన కల్పనా చాతుర్యంతో ఈ కథను దిద్ది తీర్చిన విధం ప్రశంసార్హం. భర్తకు తన భార్య ముక్కు పుడక ధరిస్తే చూడాలని ముచ్చట; ఆ భార్యకూ ముక్కుపుడకకు పొత్తు పొసగదు. భర్త ముక్కుపుడక ధరించిన సుందరీ మణులను చూస్తూ, మురిసి పోతుంటాడు.

ఇక్కడ భర్త అంతరంగాన్ని ఆవిష్కరించడంలో కృష్ణ అద్భుతమైన ప్రజ్ఞను చూపిస్తాడు. భర్త పరిశీలనగా చూస్తున్నది ముక్కు పుడకనా, ముక్కు పుడక ధరించిన ముద్దు గుమ్మనా? విప్పి చెప్పలేదు; కప్పి పుచ్చనూ లేదు. దాన్ని పాఠకుల ఊహకు విడిచి పెట్టి కథకు మంచి ముగింపివ్వడం జరిగింది.

జయంపు కృష్ణ మంచి కథకుడు అని నిస్సందేహంగా చెప్పవచ్చు. ఆయన ఆ స్థానంలోనే ఒదిగి పోకుండా, గొప్ప కథకుడి స్థాయికి ఎదిగి రావాలని కోరుకుందాం.

## జనవాణి

3వ పేజీ తరువాయి

సమయానికి లేకుండా పోయారు. దీనివల్ల రాజ్యసభలో ఛైర్మన్ చేత చీవాట్లు కూడా తిన్నారు. లక్షల రూపాయల ఆదాయం కోసం షూటింగుల్లో మునిగితేలు తుండే సినిమా తారలను ప్రజా సేవ చేస్తారని ఎమ్పీలను చేయడం ప్రజలు చేసిన తప్పు.

నెల్లూరు టి.శ్రీనివాసులు

### రామర్‌పిళ్లై ప్రయోగాన్ని గుర్తించాలి!

అతి సామాన్యుడైన రామర్‌పిళ్లై చేసిన కృత్రిమ పెట్రోల్ తయారీ ప్రయోగాన్ని ఢిల్లీలో కొందరు శాస్త్రవేత్తలు కొట్టిపారెయ్యడం సమంజసం కాదు. ఎంతో శాస్త్ర సాంకేతిక పద్ధతులు అవలంబించి కోట్లు ఖర్చుపెట్టి మన శాస్త్రవేత్తలు రూపొందిస్తున్న రాకెట్లు బంగాళా ఖాతంలో కూలిపోవడం మనం ఎన్నిసార్లు చూడలేదు. బహిరంగ ప్రయోగాలలో చిన్న చిన్న లోపాలు సహజం. శాస్త్రవేత్తలు దాన్ని సరిదిద్దాలి. ఒకటికి పదిసార్లు రామర్ ప్రయోగాన్ని వివిధ పద్ధతుల్లో గమనించాలి. ఎందువల్లో మన శాస్త్రవేత్తలకు ఆ ఓపిక లేకుండా పోయింది. రామర్‌ను విదేశాలు గుర్తించేంత వరకు మనవాళ్లు గుర్తించరేమో?

నెల్లూరు కె.కవిత

### టెలిఫోన్ డిపార్టుమెంటు పెడద్రం

నెల్లూరు కల్యాణి ఫిలిమ్స్ ఏరియాలో టెలిఫోన్ కేబుల్స్ వేయడానికి గుంటలు త్రవ్వారు. వీటిని త్రవ్వే సమయంలో ఆ వరుసలో వున్న అన్ని ఇళ్లకు కాలిబాటను వదిలారు. కానీ ప్రత్యేకించి నా క్లినిక్కుకు మాత్రమే వదలకుండా పొడవునా గుంట త్రవ్వేశారు. ఏదో చిన్న దారైతే చూడలేదని అనుకోవచ్చు. లారీలు రాగలిగే అంత దారి ఉంది. దారి దగ్గరే క్లినిక్కుకు సంబంధించిన బోర్డు కనపడుతూనే ఉంది. ఇలా ఎందుకు చేశారని అడిగితే ఇది డిపార్టుమెంటు పని, అడిగేహక్కు లేదన్నారు. ఒక క్లినిక్కుకు మాత్రమే దారి వదలక దబాయించిన వారి వైఖరిని ఏమనాలో అర్థం కావడం లేదు.

నెల్లూరు డాక్టర్ ఇ.రాజగోపాల్‌రెడ్డి

### వానాకాలంలో తారురోడ్లు!

మొదటి ముక్కిడి ఆపైన పడిశం అన్నట్లు వానాకాలంలో తారురోడ్లు వేసే పనిని నెల్లూరు మునిసిపాలిటి చేపట్టింది. కాంట్రాక్టర్లు రోడ్డపని అంటే అంతంత మాత్రంగానే చేస్తారు. చినుకులు పడే సమయంలో తారురోడ్డు అంత బాగా పడదు. నవంబరు నెల చివరి వారంలో మెటల్ రోడ్డు వేసుకొని డిశంబరులో తారురోడ్డు వేస్తే మంచిది. ఈవానల్లో తారురోడ్డు వేసినా డిశంబరుకు అక్కడ మళ్లీ గతుకుల రోడ్డు ప్రత్యక్ష మవడం ఖాయం.

నెల్లూరు టి.వి.నారాయణ

### కాలువల్లోని చెత్త రోడ్డుపై పోస్తున్నారు

ఆత్మకూరు తూర్పు కరణాలవీధిలో పంచాయతీ శానిటరీ సిబ్బంది కాల్వలను శుభ్రపరచి అందులోని చెత్తను ఎత్తిరోడ్లపై పోస్తున్నారు. అది ఎండకు ఎండి, గాలికి రోడ్డుపైన పరుచు కొంటుంది. దానికి తోడు దుర్వాసన. ఆ మార్గాన నడవడానికి ప్రజలు ముక్కులు మూసుకోవాల్సి వస్తుంది. శానిటరీ సిబ్బంది టౌన్‌లోని రోడ్లను సరిగా వూడ్చరుప్రతి వీధిని చెత్త కుప్పల మయం చేస్తున్నారు. జిల్లా పంచాయతీ అధికారి ఒకసారి ఆత్మకూరు వచ్చి పరిస్థితి సరిదిద్దాలి.

ఆత్మకూరు జి.శివరామకృష్ణ

### నాయకుల అవినీతిని కోర్టుకు నివేదించాలి

కాంగ్రెస్ నాయకుడు వై.ఎస్. రాజశేఖర రెడ్డి ఇటీవల ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు తన రాజకీయ జీవితంలో సంపాదించిన ఆస్తుల వివరాలు పత్రికల్లో ప్రకటించారు. అవినీతి విషయమై పత్రికా ప్రకటనల వరకే ప్రతిపక్ష నాయకులు సరిపెట్టు కొంటున్నారు. పబ్లిక్ ఇంట్రెస్ట్ లిటిగేషన్ పిటిషన్‌గా న్యాయ స్థానంలో వేస్తే బాగుంటుంది. తగిన ఆధారాలను కోర్టుకు సమర్పిస్తే నాయకులకు తగిన శిక్షపడి తీరుతుంది. ఈ మధ్య నేతల అవినీతి విషయమై న్యాయస్థానాలు స్పందిస్తున్న తీరు బాగుంది. ఇటువంటి పిటిషన్ల మీద కొందరు అవినీతి పరులైన నాయకులను శిక్షిస్తే, భావితరాల నాయకుల్లో కొందరికైనా బుద్ధి వస్తుంది.

నెల్లూరు పి.జ్యోతిర్మయి

### కాంగ్రెస్ దుస్థితి

శతాబ్దములు నిండిన కాంగ్రెస్ పార్టీ భ్రష్టు పట్టిపోయింది. పి.వి. నరసింహారావు మొదలుకొని పార్టీలో చిన్నసైజు నాయకుల వరకు ప్రతి ఒక్కరూ అవినీతి ఊబిలో కూరుకపోయారు. పార్టీని రక్షించే దిక్కు లేదు. గతవారం 'జమీన్‌రైతు' సంపాదకీయంలో వ్రాసినట్లు ఉప ఎన్నికల్లో కాంగ్రెస్ ఒక్కస్థానంలోనూ గెలిచే పరిస్థితి లేదు. కాంగ్రెస్ వారు చంద్రబాబుపై ఎటువంటి అవినీతి ఆరోపణలూ చేయలేకపోతున్నారు. పార్టీలో ఐక్యతలేక పోవడం, బలహీనమైన పిసిసి అధ్యక్షుడి వల్ల పార్టీ నష్టపోవడం ఖాయం. కాంగ్రెస్‌కు పూర్వవైభవం తెచ్చే పరిస్థితి సీతారాం కేసరి వంటి నాయకులకు లేకపోయినా, ఆపార్టీకి ఉన్నంత మంది కార్యకర్తలు మరిపార్టీకి లేరనేది నిజం!

నెల్లూరు వాస్తురామచంద్ర

### పోస్టుబాక్స్ అవసరం

నెల్లూరు 6వ టౌన్ పోలీస్ స్టేషన్ ప్రాంతంలో పోస్టుబాక్స్ లేదు. ఈ ప్రాంతంలో ఒక వైపు చెప్పుల ఫ్యాక్టరీ, మరో వైపు అభివృద్ధి చెందుతున్న వేణుగోపాలస్వామి కాలేజి ప్రాంతం వుంది. ఇక్కడ ఇంతకు ముందున్న పోస్టుబాక్స్ తుప్పుపట్టి శిథిలావస్థకు చేరుకొంది. ఈ బాక్స్‌లో ఉత్తరాలు వేసేందుకు ఎవరూ సాహసించడం లేదు. ప్రజల అవసరాలు గుర్తించి పోస్టల్‌శాఖ వెంటనే కొత్త బాక్స్‌ను ఏర్పాటు చేయవల్సిన అవసరం ఉంది.

నెల్లూరు సుధాకర్

### ఇసుక డొంక రోడ్డుకు మోక్షం ఎప్పుడు?

నెల్లూరు టియిడి కాలేజికి దగ్గరగా వుండే ఇసుక డొంక రోడ్డును డ్రైనేజి పైపులు మార్చేందుకు త్రవ్వారు. పైపులైతే మార్చారు గాని రోడ్డును మళ్లీ సక్రమంగా వేయలేదు. కట్ చేసిన కనెక్షన్లను తిరిగి పునరుద్ధరించ లేదు. రోడ్డు సరిగా లేకపోవడం వల్ల వాహన చోదకులు, పాదచారులు పడరాని పాట్లు పడుతున్నారు. మునిసిపాలిటీకి ఈ రోడ్డు విషయం పట్టదా?

నెల్లూరు కె.జె.ఎస్. రావు

సామాజిక స్పృహ మస్తుగా వున్న భావాల పందిరి

# ఉషస్సు కోసం తపస్సు

కవిత్వ మంటే వినోదం కాదు – అనుభవం .. సున్నిత హృదయాలలో పొంగే భావుకత్వం .. కవిత్వం.

"నీకు తోచనిది, కనపడనిది కవి చెప్పిన తర్వాత నీ అనుభవం లోనికి ఎంతో కొంత వచ్చేది – అదే నిజమైన కవిత" అన్న విశ్వకవి రవీంద్రుని మాటలు అక్షర సత్యాలు.

ఓ యువ కవి అన్నట్లు 'అకవిత్వం' రాజ్యమేలుతున్న రోజులివి. వ్యాసాలు మాత్రమే రాసుకోవాల్సిన కొందరు కవులూ, రచయిత లయిపోయి మన జీవితాలకి, మట్టికి ఏ మాత్రం సంబంధం లేని, కవిసం వాసన కూడా లేకుండా పేలవంగా వుండే 'భావాల్ని' ప్రచారం చేసుకుంటున్నారు 'కవిత్వం' పేరుతో..

ఇలాంటి అస్పష్ట, అసంపూర్ణ భావ ప్రకటనలు, వార కవిత్వం, వర కవిత్వపు ప్రేలాపనలు విస్తృత పరచుకుంటున్న తరుణంలో, సంపూర్ణ స్పష్టతే ధ్యేయంగా, 'కవి ఒక వర్గపువాడు కాదు – విశ్వ జనీన ప్రేమికుడు – ప్రేరకుడు' అనే నిత్య సత్యాన్ని చాటి చెబుతూ 'ఉషస్సు కోసం తపస్సు' అనే కవితా సంపుటి రచించి వెలువరించారు సిరాసు కవి అనే సిద్ధంశెట్టి రామసుబ్బయ్య.

'భావాలను మోయలేము – బందీలుగా వుంచలేము' అన్నట్లు నిత్యం మన కెదురయ్యే అన్ని అంశాలపై కవితలు వ్రాసి 'కభాష్' అన్పించారు

> **గ్రంథ సమీక్ష**
>
> **ఉషస్సు కోసం తపస్సు**
>
> రచయిత
>
> **సిద్ధంశెట్టి రామసుబ్బయ్య**
>
> సమీక్షకుడు
>
> **పెరుగు రామకృష్ణ**
>
> ప్రతులకు – ఎస్. వెంకటేశ్వర్లు, 11/391, సంతపేట, నెల్లూరు - 524 001
>
> వెల రూ. 25/-

తన యీ నాల్గవ ముద్రిత కవితా కావ్యంలో.

'కవిత ఆగిపొమ్మంటే ఆగేది కాదు – రారమ్మంటే అసలే వచ్చేది కాదంటూ' కన్ఫ్యూజన్ కవితలో కాగడా పెట్టి వెతికినా కనబడ కూడదనే సిద్ధాంతం నమ్మి, సరళీయత, స్పష్టత ప్రధానంగా కవిత్వం రాస్తానంటున్నాడీ కవి.

'అక్షరం నా ఆయుధం' కవితలో 'అక్షరం పరబ్రహ్మ స్వరూపం' – బ్రతుకు బాటని మార్చేందుకు, ప్రగతి బాటను తీర్చేందుకు అక్షరం నేర్పిన జాతి ప్రధానం అంటూ అక్షరం విలువ తెల్పడంలో కవి సృజనాత్మకత సంపుష్టిగా కరం త్రొక్కింది.

"సుస్మితా సేన్, ఐశ్వర్యా రాయ్‌లు విశ్వ సుందరులే కాని మదర్ థెరిస్సా 'ఆత్మ విశ్వ సౌందర్య రాశి' – కవితలో ప్రేమమయి, కరుణా మూర్తి, ప్రపంచం యావత్తు ఏక కంఠంతో అంగీకరించిన 'సేవ ప్రియమాత' మదర్ థెరిస్సా లాంటి వ్యక్తిని కవితా వస్తువుగా వాడి తన కవిత్వంను మరో మెట్టు పైకెక్కించాడు సిరాసు కవి.

'ఫాసిస్టు పాలకుల ఆటలు కట్టి వేయక ఓ.కే, శాంతి పావురాలు, ఐక్యరాజ్య సంస్థలు ఉరి వేసుకొని చావాల్సిందే' ఇరాక్ – అమెరికా యుద్ధం వంటి అంతర్జాతీయ సంఘటల్ని తన కవిత్వంలో బంధించి 'భద్రత నివ్వని భద్రతా మండలి – భరోసా లేని ఐక్యరాజ్య సమితి' - అంటూ ధైర్యంగా వెక్కిరించాడు.

'ఎందుకు వాళ్లు ఎన్నుకున్నారో యుద్ధాన్ని గల్ఫ్ యుద్ధం పట్ల తీవ్రంగా ప్రతిఘటిస్తూ యుద్ధాల పట్ల తన వెగటు భావం వెలువరించాడు.

జాతీయ, అంతర్జాతీయ, దేశభక్తి, ఆధ్యాత్మిక చింతన, అంతరించి పోతున్న మానవతా విలువల గురించి ఆవేదన లాంటి అభ్యుదయ గేయ కవితలు ప్రవాహ రూపంలో వెలువరించి, లోక కళ్యాణం గురించి ఆర్తి వెలిబుచ్చిన కవి యిదే సంపుటిలో 'ప్రేమ గీతాలు' చోటు చేసుకునేందుకు తావివ్వక పోయి వుంటే బాగుండేది. సంఖ్య పెంచడం వల్ల కాబోలు కొన్ని కవితల్లో స్థాయి తగ్గింది.

పీఠికలో డాక్టర్ మల్లెల శ్రీహరి గారన్నట్లు జాతి, కుల, మత, భేదాలను నిరసిస్తూ, సమతా భావాలతో సాగిపోయిన కవిత్వంగా యీ సంపుటి విలక్షణంగా గోచరిస్తుంది.

మొత్తం మీద సామాజిక స్పృహ మస్తుగా వున్నయీ కవితలు సమాజ వికాసానికి మరింత దోహద పడతాయని భావాల యిటుకల్ని భద్రంగా పేర్చినట్లున్న యీ 'కవిత్వం' (ప్రాస మరికొంత జోడిస్తే) పదుగురి మెప్పు పొంద గలదని ఆశిద్దాం.

'బాపు' సృష్టి అయిన ముఖ చిత్రం యీ పుస్తకానికి సరిక్రొత్త వన్నె తెచ్చింది.

## 50 ఏళ్ల క్రితం

3వ పేజీ కొరవ

తాతాచారి గారు ఇంకను గోగినేని రంగ నాయకులు, ఎం. భక్తవత్సలం, వెన్నెలకంటి రాఘవయ్య, పి. సుందర వరదులు, నెల్లూరు వెంకట్రామా నాయుడు, దర్శిపూడి వెంకట నారాయణ రెడ్డి, గరిమెళ్ళ కుమార స్వామి వారలుపన్యసించారు - సోమవారం పెదబ్రమనాయుడు

### ఆంధ్ర రాష్ట్ర మహిళా కాంగ్రెసు మహాసభ

పొనకు కనకమ్మ గారి ఆహ్వాన సంఘ అధ్యక్షోపన్యాసం

ఆహ్వాన సంఘాధ్యక్షులు పొనకా కనకమ్మ గారు లేచి తన ఉపన్యాసమును ప్రారంభించిరి.

### సింహపురి ప్రాముఖ్యం

ఒకప్పుడు తెలుగుసీమలో ప్రాభవము గన్నది సింహపురి. కవిబ్రహ్మ తిక్కన, ప్రబంధ పరమేశ్వరుడు ఎర్రా ప్రెగడ, శౌర్య ధన్వి రణ తిక్కని, కమ్మని రామాయణ మల్లిన మొల్ల ఇక్కడే జన్మించిరి. ఇప్పుడు గాంధీ గారికి ప్రీతికరమైన పల్లెపాడున్నది ఈ మండలం లోనే. వారి ఆశీస్సులకు ప్రాభవమైన కస్తూరిబా విద్యాలయ మున్నది గూడ ఇక్కడే.

### నెల్లూరు ముచ్చట్లు

#### వర్షాలు లేవు

ఈ జిల్లాలో యింత వరకు వరియగు వర్షాలు లేవు. హస్తకార్తె కూడా ఉత్త చెయ్యి చూపి వేసింది. జిల్లా గ్రామాలు మాత్రం పెన్నా నది ధర్మాన ఒక విధంగా పర్వాలేదు. కాని మెట్ట తాలూకాల గతియేమి? ఐనా చిత్త కార్తె యేమంటుందో అడుగుదాం. ఈ సమయంలో రామకృష్ణ సిద్ధాన్తి బ్రతికి వుంటే యింత అన్యాయం జరుగదు గదా?

#### మోటార్ డ్రైవింగ్

టౌను మూర్తి గారి వ్యాన్, మోటార్ డ్రైవింగ్ సరిగా లేదని నాయుడు పేట సమీపంలో రోడ్డు మీద పడవ లేదటనే! లైసెన్సు లోపమున్నా మరీనా?

#### రాజం శిశు సంరక్షణ కేంద్రం

విజయ దశమి నాడు రాజం గారి శిశు సంరక్షణ కేంద్రంలో బీద బిడ్డలకు గుడ్డలు పంచి పెట్ట బడినవి. సాయంకాలము శిశు సంరక్షణాలయం లోని పిల్లలు అందరు లేడీస్ క్లబ్బులో వినోద కరమైన వేషములను ధరించిరి. ఆ వేషధారులకు బహుమతుల నిచ్చిరి.

#### దగాశేర్లు

కొనే దానికి ఎక్కువ. అమ్మేదానికి తక్కువ శేర్లు ఉపయోగిస్తున్నాడని సౌత్ మోపూరు అమరా వెంకట సుబ్బయ్య శెట్టి గారిని శేరతోటి నెల్లూరు సబ్ ఇన్స్పెక్టర్ పాల్ పట్టుక వచ్చాడట.

#### అవి – ఇవి

12.9.46 రైలులో వెండి సామాను, మందు సీసాలు వగైరాలున్న ఒక పండ్ల బుట్ట చోరగ్రస్త మైంది. గండవరం యేమిరెడ్డి పుల్లా రెడ్డి యింటిలో పోలీసులు ఒక బుట్ట పట్టుకొన్నారు. అది తనదే నంటాడు రెడ్డి. ఆ టైములో యీ రెడ్డి గారు మద్రాసు నుండి ప్రయాణము చేసిన మాట నిజమేనట. గుర్తింపు కోసం కాబోలు పోలీసులు ఆ బుట్టను పట్టుకొని పోయినారు. దాన్నడిగితే ఐదే యెవరి నెత్తిన పడుతుందో?

#### పల్లెటూళ్లు

##### వితంతు బాల్యవివాహాలు

నేరులేని పసిపాపలకు పెళ్లిళ్లు చేసి చిన్నప్పుడే భర్తలు చనిపోవడం వల్ల వారిని బలవంతపు కష్ట జీవితానికర చేయుచున్నారు. ఆయాచారాన్ని మాపుటకు పూనుకొన్నాము. బాల్యవితంతు వివాహాలు చేయండి.

-కార్యదర్శి రామాపురం రైతు కాంగ్రెస్

* * *

1937నుండి జరిగిన జమీన్‌దార్ల విక్రయాలను రద్దు చేయవలెను. రాయలసీమ ప్రాజెక్టులు వెంటనే నిర్మించాలి. బావుల పట్టేది వెయ్యి రూపాయలు చెయ్యాలి.

## సినిమా

9వ పేజీ కొరవ

జాగర్త", పల్లవి ఆర్ట్ పిక్చర్స్ "అంతే! ఇంతే!", సాయి చిత్ర "అన్నదాత", యు.ఎస్.ఆర్. క్రియేషన్స్ "బంగారు కోడలు", శ్రీ కోదండపాణి ఫిలిం సర్క్యూట్స్ "భామనే సత్య భామనే", చంద్రమణి ఆర్ట్స్ "చలనం", మహాగణపతి ఫిలిమ్స్ "క్రేజీబోయ్", వినీషా ఫిలిమ్స్ "డిక్టేటర్", పల్లవి ఆర్ట్ పిక్చర్స్ "అదండి సంగతి", ఎస్.వి.ఎస్.క్రియేషన్స్ "దొంగా దొంగే" తారక ప్రభు ఫిలిమ్స్ "గురువుగారి అబ్బాయి", సెంట్రల్ ఆర్ట్ మూవీస్ "గందరగోళం", స్వాతి క్రియేషన్స్ "అందో పాకిస్తాన్", ఓం సాయిబాబా ఫిలిమ్స్ "ఇద్దరు కన్నెల ముద్దుల బావ", అనూరాధ ఫిలిమ్స్ డివిజన్ "కుటుంబ ప్రతిష్ఠ", రామకృష్ణ హార్టి కల్చరల్ సినీ స్టూడియోస్ "కలియుగ భీమ్మడు", మారుతి ఫిలిమ్స్ "కలలో వరగోల", లక్ష్మి విజయ పిక్చర్స్ "ముత్యాల తలంబ్రాలు", శ్రీ వెంకటేశ్వర ఆర్ట్ ఫిలిమ్స్ "ఒక చిన్నమాట", మూర్తి మూవీ క్రియేషన్స్ "ప్రేమకుమార్", సృజనా ఫిలిమ్స్ "పట్టువదలని విక్రమార్కుడు", ట్రాక్స్ క్రియేషన్స్ "సందట్లో సడేమియా", కావ్య చిత్ర "శుభముహూర్తం", కల్యాణ్ కమ్యూనికేషన్స్ "సూపర్ బ్రదర్", నాగార్జున సినీ క్రియేషన్స్ "యాదగిరి మామ - నైజాం పోరి", శ్రీ ఈశ్వరమ్మ ప్రొడక్షన్స్ "మీవారే మావారు", సి.ఎం.ఆర్.ఫిలిమ్స్ "విక్టరీ ఆలీ రాజా".

## చిత్ర సమీక్ష

9వ పేజీ కొరవ

కె.భాగ్యరాజ్ వ్రాసిన కథ ఇది. అంటే ఈ చిత్రం ఏదో ఒక తమిళ చిత్రానికి ఆధార మన్నమాట. అగ్రవర్ణం, బడుగు వర్గం మధ్య కుమ్ములాటతో తయారైన చిన్న కథకు తెలుగు దర్శకుడు ఇ.వి.వి. సత్యనారాయణ చిలవలు, పలవలు చేర్చి, కథకు సంబంధంలేని సన్నివేశాలను కూర్చి, నిరర్ధకమైన దృశ్యాలను పేర్చి, రమణి, బాబూరావుల నిష్ప్రయోజనమైన రచనను జతచేర్చి చిత్రం నిడివిని చాలా పెంచి విసుగు పుట్టించారు. కథనం కృత్రిమంగా సాగుతుంది. ఈ కృత్రిమత్వం, పాత్రలను మలచిన వికృతత్వాలు, మంచి స్థాయిలో వున్న మోహన్‌బాబు, రమ్యకృష్ణ, గౌతమి, కోట శ్రీనివాసరావు బ్రహ్మానందం, జె.వి. సోమయాజులు, ఎ.వి.యస్ నటనను దెబ్బతీశాయి. కీరవాణి సంగీతం, స్వామి ఫోటోగ్రఫి అంతంత మాత్రంగా అమరాయి.

కథ చెప్పాలంటే, కల్లుగీత కులానికి చెందిన చంద్రం (మోహన్‌బాబు) చదువుకున్న నిరుద్యోగి; ఉన్నట్టుండి బ్రాహ్మణుడుగా వేషం మార్చి, చంద్రశేఖర శాస్త్రి పేరుతో ఆ ఊరి బ్రాహ్మణ అగ్రహారంలో తిష్టవేస్తాడు. అతని వేదపఠనం సరిగ్గా వుండనందున అగ్రహారపు పెద్ద పరమేశ్వరశాస్త్రి (జె.వి. సోమయాజులు) అతడ్ని బైటకుపంపుతాడు. ఆతర్వాత దయతలచి బ్యాంకు అప్పుతో అతనిచేత టెలిఫోన్ బూతు పెట్టిస్తాడు. పరమేశ్వరశాస్త్రి కూతురు భవాని (రమ్యకృష్ణ) అతడ్ని ప్రేమిస్తుంది. పరమేశ్వరశాస్త్రి తన కూతురు పెళ్ళి చంద్రశేఖరశాస్త్రితో జరిపిస్తాడు. అసమయాన చంద్రశేఖర శాస్త్రి తండ్రి (కోట శ్రీనివాసరావు) అక్కడికి రావటంతో అసలు మోసం బయటపడుతుంది. పరమేశ్వరశాస్త్రి ఉగ్రరూపం దాలుస్తాడు. తన కూతుర్ని నిలదీస్తాడు. ఆమె తండ్రిని ఎదిరించి చంద్రం వుండే గూడానికి వెళ్తుంది. "నీవు మనిషిగా మారి నీకూతుర్ని ఏలుకోమని కోరేవరకు నీ కూతుర్ని నేను స్వీకరించనని" చంద్రం పరమేశ్వరశాస్త్రిని హెచ్చరిస్తాడు. అతను పెద్ద ఉపన్యాసం దంచేస్తాడు. అది పరమేశ్వర శాస్త్రి మూర్ఖత్వాన్ని అదరగొట్టుంది. అదిరింది అల్లుడూ అంటూ మారిపోయిన పరమేశ్వరశాస్త్రి చంద్రాన్ని, భవానిని భార్యా భర్తలుగా కలుపుతాడు.

కులాంతర వివాహాలు ఈనాడు మామూలైపోయాయి. చట్టం అండదండలతో, పెద్దల ఆదరణతో, తల్లిదండ్రుల అనుమతితో, ప్రేమికుల పట్టుదలతో ఎన్నో సులభంగా జరిగిపోతున్నాయి. ఈనాడు ఈ సమస్య మీద ఏదో ఒక కులాన్ని క్రూరంగా చూపుతూ చిత్రాలు తియ్యవలసినవసరం లేదు. తీసినా ఇలాంటి నీరసించిన, మోసంతో నిండిన కథతో తియ్యటం సరికాదు. కథ, కథనం ఎలావున్నా, చిత్రంలో ఫైటింగులు, శృంగారం పుష్కలంగా వున్నాయి. నిర్మాత, వ్యాపారానికి, ప్రేక్షకుల ఆనందానికి అవేగా అవసరం!

## నెల్లూరు సంగతులు

4 పేజీ కొరవ

లక్ష్మితో కలసి 10తేది వెంగళరావునగర్, అంబేద్కర్‌నగర్, రాంనగర్, ప్రగతి నగర్, జాకీర్‌పేట, కటారిపాళెం, వెంకటేశ్వరపురంలో, డిసిసి కార్యదర్శి దేవకుమార్‌రెడ్డి, సునీల్‌కుమార్‌రెడ్డి ఇతర పార్టీ నాయకులు, వార్డు కౌన్సిలర్లతో వెళ్లి సద్భావం కార్యక్రమాన్ని జరిపిస్తా మంటున్నారు వివేకా!

### హుస్సేనీకి సాలిడారిటి అవార్డు

దిగువస్థాయిలో వుండే మైనార్టీల అభ్యున్నతికి పాటుపడి నందుకు నెల్లూరుకు చెందిన ఎస్.ఎ.ఎం. హుస్సేనీకి నేషనల్ సాలిడారిటి అవార్డు లభించింది. గతవారం హైదరాబాదు లోని ప్రకాశం భవన్‌లో జరిగిన ప్రత్యేక కార్యక్రమంలో సాలిడారిటి కమిటీ తరపున మాజీ మంత్రి మహమ్మద్ అలీషబ్బీర్ ఈ అవార్డు అందించారు. హుస్సేని వృత్తిరీత్యా మెడికల్ రెప్రజెంటేటివ్. కాని సింహపురి మైనార్టీ ఆర్గనైజేషన్ స్థాపించి ముస్లింలకు ఉచిత వైద్య శిబిరాలు, ఖత్నా, ఉచిత పెళ్లిళ్ల కార్యక్రమాలు చేయించారు. హుస్సేని రాష్ట్ర కాంగ్రెస్ కమిటీ మైనారిటీ సెల్‌కు ఆర్గనైజింగ్ కార్యదర్శిగా కూడా పనిచేస్తున్నారు.

### కళాకారులకు సినీ అవకాశం

నెల్లూరు టౌన్ పొదలకూరు రోడ్డులోని లేక్ వ్యూ కాలనీలో న్యూ స్టార్స్ ఫిల్మ్ & టివి ఇన్‌స్టిట్యూట్‌ను 9తేది ప్రారంభించారు. ఇందులో నటన, కరాటే, డ్యాన్సులు నేర్పుతామని సంస్థ ఛైర్మన్ రియాజ్ తెలిపారు. సినీ దర్శకుడు పి. బాబునాయుడు త్వరలో ఆశ - నిరాశ టెలిఫిల్మ్‌లో, పరలోక వీరుడు - నాగలోక సుందరి చిత్రంలో స్థానిక కళాకారులకు అవకాశాలు ఇవ్వనున్నట్లు తెలిపారు.

### పుస్తకావిష్కరణ

సింహపురి సాహిత్య సాంస్కృతిక అకాడమీ 13 తేది కొత్త పద్మావతమ్మ మహిళా గ్రంథాలయంలో పుస్తకావిష్కరణ సభ ఏర్పాటు చేస్తుంది. శ్రీమతి దోర్నాదుల సుబ్బమ్మ రచించిన తరుణీ తరంగాలు కథానికల సంపుటిని సాహితీ వేత్త డాక్టర్ బెజవాడ గోపాల రెడ్డి ఆవిష్కరిస్తారు. [illegible] గోరంట్ల రాధాకృష్ణ సభను అధ్యక్షిస్తారు. రచయిత జయంపు కృష్ణ పుస్తకాన్ని సమీక్షిస్తారు.

## సణుగుడు

నాలుగవ పేజీ తరువాయి

వారు డాక్టర్ చొక్కా పట్టుకొన్న మాట నిజమే. ఆ సమయంలో అది అతి సహజం. కాని, ఆ విన్నపాలు చూసి, అందరు జూనియర్ డాక్టర్లు సమ్మె కట్టారు; అన్ని ఆస్పత్రులలోనూ రోగులను యమ భటులకు అప్పగించారు. ఆస్పత్రి పడకలు పేద రోగుల పాలిట మరణశయ్యలై పోయాయి. వారు పెట్టే చావు కేకలను ఈ వైద్య శిఖామణులు వీనులవిందైన సంగీతంగా విని వినోదించారు. ఎందరు తల్లి దండ్రులు తమ బిడ్డల చావును కళ్ళారా చూడలేక, చూసి ఏమీ చేయలేక కన్నీరు మున్నీరుగా విలపించినా వీరి బండరాతి గుండెలు కరగలేదు.

ఆస్పత్రులలో తమకు సెక్యూరిటీ సిబ్బంది రక్షణ కావాలని; అది ఏర్పాటు చేసేవరకు సమ్మె మానేది లేదని భీష్మించుక కూర్చున్నారు. ప్రభుత్వం దిగివచ్చి, వారి కోరిక తీర్చి, మరీ సమ్మె విరమింప చేసింది.

డాక్టర్లు చేయవలసిన పనేనా ఇది? వైద్య వృత్తి విలువ, గౌరవం, ప్రాధాన్యత తెలిసి చేసిన పనేనా ఇది? ఎంత ఘోరం! ఎంత కిరాతకం! సమయం, సందర్భం చూడకుండ అర్థ రాత్రి పిలుపు వచ్చినా పరుగెత్తిపోయి ప్రాణదానం చేయవలసిన వైద్యులు - ఫ్యాక్టరీ కార్మికుల వలె, ప్రభుత్వోద్యోగుల వలె సమ్మెకు దిగడం మానవత్వంతో కూడిన చర్యేనంటారా? తమ కోరికలు సాధించుకోవడానికి మనుషులను చంపడం తప్ప వేరే మార్గమే లేదా? ఆ చావులన్నీ ఆయా డాక్టర్లు చేసిన హత్యలు కావా? చట్టం వారిని శిక్షించలేక పోయినా - వారి అంతరాత్మల్లో తమ హత్యాకాండ గిలిపెట్టదా? మనస్సు నిలదీయదా? వీళ్ళు నిజంగా డాక్టర్లేనా? వీరిని పశువులుగానే, రాక్షసులుగానే, కిరాతకులుగానే పిలవడం నేరమౌతుందా?

తప్పుచేసిన డాక్టరుకు ఈ దేశంలో శిక్షలేదు; ఏ రుజువూ, సాక్ష్యం చెల్లడం లేదు. ఎందరు డాక్టర్లు కేవలం నిర్లక్ష్యంతో, బండగొంది తనంతో, తల పొగరుతో, చేతకాని తనంతో, వ్యసనాల బలహీనతతో రోగులను చంపడం లేదు? సకాలంలో మందులు ఇవ్వకుండా, తప్పుడు ఆపరేషన్లు చేసి, రోగనిర్ధారణ చేయకుండా గంటే తుడుపు చికిత్స జరిపి, కల్తీ ఇంజక్షన్లు వాడి, లంచం కోసం వైద్యం ఆలస్యం చేసి రోగులను చంపడం చాలా సాధారణంగా జరిగిపోతూంది. ప్రభుత్వ ఆస్పత్రులలో ఇది చాలా మామూలు విషయం. తమ ఇంటి దగ్గర ప్రాక్టీసు పెంచుకోవడానికి రోగుల ప్రాణాలతో చెలగాటాలాడే ప్రభుత్వ డాక్టర్లు; రాత్రికి రాత్రి కోటీశ్వరులు కావాలనే తపనతో తమకు చేతకానప్పటికీ రోగిని డిశ్చార్జి చేయకుండా ప్రాణం మీదకు తెచ్చే ప్రైవేటు డాక్టర్లు కోకొల్లలుగా వున్నారు మనకు! కేవలం డబ్బు కోసం అవసరం లేని ఆపరేషన్లు చేసే సిములూ వున్నారు మనలో! మందుల కంపెనీలిచ్చే కమీషన్ల కోసం చవకబారు మందులు వ్రాసి, రోగులను చంపే కిరాతకులు వున్నారు; మలమూత్ర పరీక్షలలోనూ పర్సెంటేజీలు భోంచేసే అమేధ్య భోక్తలున్నారు; మరి వీరందరి తప్పులకు, నేరాలకు, ఘోరాలకు శిక్షలు అవసరం లేదా? వారు చేసిన తప్పుకు వారిని నిలదీస్తే, అదేమని అడిగితే, కన్న బిడ్డను కోల్పోయిన కోపంతో గట్టిగా కేకలు పెడితే అందుకు సమ్మె చేయాలా? ఇందరి ప్రాణాలు తీయాలా?

డాక్టర్లలో అటువంటి తప్పులు చేసేవారి సంఖ్య చాలా తక్కువే కావచ్చు; అధిక శాతం మంది నిజాయితీతో, సేవా దృక్పథంతో, వృత్తి పట్ల నిబద్ధతతో, రోగుల ప్రాణాలను కాపాడటానికి చిత్త శుద్ధితో కృషి చేస్తున్న మాట నిజం. కొందరు దౌర్భాగ్యుల మూలంగా వైద్య వృత్తి పట్లనే ప్రజలలో చులకన భావం ఏర్పడుతున్న మాట వాస్తవం. కాని సమ్మె పేరుతో అటువంటి హృదయ వైశాల్యం కలిగిన వైద్యులూ, అటువంటి సంకుచితతత్వ, స్వార్థపరులతో కలిసి సమ్మెలకు దిగడం విచారకరం; వారిని మందలించి, దారిలో పెట్టలేక, అందరి ప్రాణాలు పోయినా ఏమీ అనలేక రాజీపడిన ప్రభుత్వ అసమర్థత మరీ శోచనీయం.

* * *

జిల్లా మంత్రిత్వం విషయంలో పలు రకాల వూహాగానాలు వెలువడుతున్నాయి; రకరకాల కథలు ప్రచారంలోకి వస్తున్నాయి. జిల్లాకు ఇప్పుడు ఇద్దరు మంత్రులున్నారు. అందువల్ల, మూడవ మంత్రిత్వం అసాధ్యం. అది తెలిసి జిల్లా ఎమ్మెల్యేలలో ఆశలు కల్గుతున్నాయంటే - ఆ ఇద్దరిలో ఒకరికి ఉద్వాసన తప్పదన్న భావం వారికి కలిగివుండాలి. అది కేవలం తమ ఆశ అయితే వారంత ఆరాట పడరు. ఉద్వాసనకు గట్టి నిర్ణయం జరిగిందన్న నమ్మకం కల్గితేనే వారిలో కొత్త [illegible] చిగురించి వుండాలి.

కాని, వారి నమ్మకానికి ఆధారమేమిటి? ఉద్వాసన ఎవరికి? రమేష్‌రెడ్డికా, దుర్గా ప్రసాద్‌కా? లేక ఇద్దరికీనా? అందుకు కారణమేమిటి? ఈ ప్రశ్నలకు బహిరంగంగా సమాధానాలు చెప్పే సాహసం ఏ ఎమ్మెల్యేకి లేదు; సైగ్గా అడిగితే మాత్రం తమ తమ వాదాలు, వార్తలు అనర్గళంగా విన్పిస్తున్నారు.

వచ్చిన చిక్కు ఏమిటంటే - జిల్లాలోని ప్రతి ఎమ్మెల్యేకీ మంత్రి కావాలనే ఆశ. మంత్రిత్వానికి తాము అర్హులమేనన్న ఆత్మవిశ్వాసం. ముఖ్య మంత్రి తమ పేరే పరిశీలిస్తున్నారన్న భ్రమ పుష్కలంగా వున్నాయి. సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి, కొమ్మి లక్ష్మయ్య నాయుడు, వెంకటగిరి యాచేంద్ర, కంభం విజయరామిరెడ్డి, ఈ ఆశల లిస్టులో మొదట వున్నారు. చంద్రమోహన్‌రెడ్డికి తను చాలా సమర్థుడనని నమ్మకం; మొదటి సారి తన పేరు కొద్దిలో మిస్ అయ్యిందని భావన! కంభం విజయరామిరెడ్డి గారిది - ఉదయగిరిలో పార్లమెంట్ ఎన్నికల్లో మెజారిటీ క్వాలిఫికేషన్; వెంకటగిరి యాచేంద్ర గారికి తన పెద్దరికానికి, బూజుపట్టిన రాచరికానికి ప్రాధాన్యత కావాలన్న దుగ్ధ! లక్ష్మయ్య నాయుడు గారిది - రెడ్డి కమ్మ లెక్కల మతలబు; ఆత్మకూరులో గ్రుడ్డిలో మెల్లగా మెజారిటీ చూపించి మైనస్ మార్కులు పడకుండా బ్రతికి పోయాడు.

ఒక్క జిల్లాలో ఇందరి కోరిక తీర్చడం ముఖ్యమంత్రికి అసాధ్యం. అయితే ఇందులో ఏ ఒక్కరి కోరికనైనా తీర్చాలనే ఆలోచన ఆయనలో వుందా అన్నదే సమస్య! అది తేల్చి చెప్పే వారెవరు? పోనీ అటువంటి ఆలోచన వుందనుకున్నా - వుంటే వారిలో ఒకరిని వూడబెరకాలి కదా? ఎందుకోసం ఆయన అటువంటి నిర్ణయం తీసుకోవాలి? చంద్రబాబు కంప్యూటర్‌లో ఈ ఇద్దరు మంత్రులకు ఫెయిల్ మార్కులు పడ్డాయని, అందువల్లే ఆయనా నిర్ణయం తీసుకొంటున్నారని ఎమ్మెల్యేల వాదన. పార్లమెంట్ ఎన్నికల్లో నెల్లూరు, గూడూరులలో తెలుగుదేశం మైనస్‌లో పడడం; ఏడాది నుంచి మంత్రులైనా జిల్లాలో పార్టీ అభివృద్ధికి వీరి నుంచి సహకారం అందకపోవడం; ఎమ్మెల్యేలను కలుపుకు పోవడంలో ఇద్దరూ విఫలం కావడం; తమ తమ మంత్రిత్వ శాఖల విషయాలలోనూ ఇద్దరూ అంత సమర్థత ప్రదర్శించలేక పోవడం; కంప్యూటర్‌లో రికార్డయిందని; రమేష్‌రెడ్డికి ఇదివరలో వలె హరికృష్ణ సిఫార్సు లేనందువల్ల, దుర్గాప్రసాదుకు ఇదివరలో వలె చంద్రబాబుతో సాన్నిహిత్యం లేకపోవడం వల్ల; ఇద్దరిలో ఎవరూ తమకు పదవి వున్నా, పోయినా చంద్రబాబును ధిక్కరించి మాట్లాడి, న్యూసెన్స్ సృష్టించే శక్తి పరులు కాకపోవడం వల్ల వీరిలో ఒకరికి లేదా ఇద్దరికీ ఉద్వాసన తప్పదని ఎమ్మెల్యేలు చెప్తున్నారు.

కాని ఈ అభిప్రాయం అంత సరైనదని అన్పించడం లేదు. చంద్రబాబుకు సమర్థులు, శక్తి పరులు అవసరం లేదు. పార్లమెంట్ ఎన్నికల్లో 16సీట్ల విజయం ఆయన ఆత్మ విశ్వాసం పెంచింది. రేపటి ఉపఎన్నికలలో కాంగ్రెస్ చేతకాని తనం వల్ల ఆయన కళ్లు నడినెత్తికెక్కడం ఖాయం. ఈ పరిస్థితులలో ఆయన తానొక్కడు తప్ప, తక్కిన పార్టీ యావత్తు మిథ్య అని ఎన్టీఆర్ వలె భావించడం సహజం. ఆ కోణం నుంచి చూస్తే చంద్రబాబు తన మంత్రి వర్గంలో దిష్టి బొమ్మలు వుండడాన్ని ఇష్టపడతాడు తప్ప; సమర్థులు, తమ శక్తివల్లే ఓట్లు వచ్చాయని భావించేవారు, తమ పెద్దరికం అని [illegible] ప్రాకులాడేవారిని సహిస్తాడా? చేరదీస్తాడా? నాకు నమ్మకం కల్గడం లేదు.



# సంస్మరణ



పెళ్ళకూరు రామచంద్రారెడ్డి గారి

ప్రథమ వర్ధంతి సందర్భంలో

వారిని స్మరించుకుంటూ...

... కుటుంబ సభ్యులు

| జననం | మరణం |
|---|---|
| 5.3.1923 | 12.10.1995 |

Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. Offset Printing at Nayagara Paper Products (India) Limited, Nellore